# ఉదయకవిత

(బాలవిజ్ఞానసంచిక)




జిల్లా పరిషదున్నత పాఠశాల దేవరయాంజాల

**1968**

సంపుటి 1 సంచిక

# సంపాదకీయము

ఇది మా తొలి వార్షిక సంచిక, ప్రప్రథమముగా మా చిరు హృదయములందు మొగ్గ తొడగుచున్న సాహిత్య కుసుమములను ఒకరూపమున తీర్చి దిద్దవలెనను ఆకాంక్షయే, యీ "ఉదయ కవిత."

ఆదికవి నన్నయ నాటినుండి, ఆధునిక సాహిత్యము వఱకు తెలుగు కవితా లతాంగి అనేక కావ్యభూషణములను ధరించి, నిత్యనూతన వధువుగా వెలుగుచున్నది. "దేశ భాషలందు తెలుగు లెస్స" అన్నాడు ఆంధ్ర భోజుడు. అట్టి తేనె భాషను మాతృభాషగా చేసికొని జన్మించిన ఆంధ్రులు అదృష్టవంతులగుట సహజమే.

'కా' గుడింతాలు వల్లించునప్పుడు, ప్రారంభింప బడిన వేమన పద్యాలు మొదలుకొని ఉన్నత తరగతులలో గల కవిత్రయము కవితా మాధుర్యము, పోతన, సన్నెచోడాది, శృంగార కవుల పదలాలిత్యము కొంత కొంతగా రుచిచూచిన వారలము కాబట్టి, సాహిత్య రసాస్వాదన మాతృభాషయం దభిమానము మెండుగా మా కలవడినది.

"ఉదయకవిత" యందు, వివిధములయిన రచనలు పొందుపరుపబడినవి. గేయములు, వ్యాసములు, కథానికలు, ఒకటి రెండు ఏకాంకికలు విద్యార్థులమైన మేము రచించిన రచనలందు అంత ఔచిత్యము గోచరింపదను విషయము మే మెఱుంగుదుము. నలుగురిముందు మా 'తహ, తహ'ను వెల్లడించవలెనని సహృదయులైన పెద్దల ఆశీర్వాదములు పొందవలెనని కోరిక పిన్నలమయిన మాకుండుట సహజమే.

వార్షిక సంచిక వెలువరింప వలయునన్న అభిప్రాయమును విన్నవించినంతనే అంగీకరించి మా కన్నివిధముల ప్రోత్సాహమిచ్చిన ప్రధానోపాధ్యాయులకు, హృదయపూర్వక కృతజ్ఞత లర్పించుచున్నాము. మారచనలకు మార్గదర్శకులై తప్పులను సవరించిన ఉపాధ్యాయ హితవరులకు సదా కృతజ్ఞులము. తమ అమూల్యములైన సందేశములను అభిప్రాయములను, ఆశీర్వచనములను పంపిన పెద్దలందఱికి నమస్సు లర్పించుచున్నాము.

కొన్ని వ్యాసములు వ్రాయుటకు ప్రముఖకవుల గ్రంథములు తోడ్పడినవి. అట్టి గ్రంథ కర్తలకు మా ప్రణామములు.

'ఉదయకవిత' మీ హస్తముల నలంకరించి, మాననీయుల అభిమానమును చూరగొనునను విశ్వాసమును ప్రకటించుచున్నాము.

—సంపాదకవర్గము.

# కృతజ్ఞతలు.

"ఉదయకవిత" నావిష్కరించిన

అఖిలభారత తెలుగురచయితల సమితి కార్యదర్శి

శ్రీ పోతుకూచి సాంబశివరావు B. A. L L. B. గారికి

వార్షికదిన, ఆవిష్కరణోత్సవమునకు విచ్చేసిన

జిల్లా పరిషత్తు కార్యదర్శి

శ్రీ భద్రి నారాయణగారికి

ఉపకార్యదర్శి

శ్రీ కె. ఎస్. జోసఫ్‌గారికి.



# మా పత్రికకు విరాళమొసంగిన దాతలు.

డా. పి. నారాయణస్వామి.

శ్రీ బెజుగం ఆగయ్యగుప్త.

శ్రీ కందుకూరి వెంకటేశం.

చింతల వేంకటనారాయణరెడ్డి.

రాచ వేంకటరాములు.

# విషయసూచిక



# MESSAGE



PRESIDENT'S SECRETARIAT,
RASHTRAPATI BHAVAN,
NEW DELHI-4.

November 16, 1967.

No. F- 3-M/67.

*My Dear Reddy,*

The President is glad to learn from your letter of the 6th November, 1967, that Zilla Parishad High School, Devar Yamjal, is bringing out the first issue of the school magazine "UDAYA KAVITA". He sends his best wishes on the occasion.

*Yours Sincerely,*

(S/d.) ..................

Under Secretary.



*DR. M. CHANNA REDDY*

MPS/1301/67

MINISTER OF
STEEL, MINES & METALS
INDIA

New Delhi, the November 10, 1967.

*My dear Y. I. Reddy*,

I am glad to learn that you have decided to bring out your School Magazine. School and College Magazines provide a very useful vehicles for bringing out the hidden talents of budding writers and leaders. Many of the national leaders of to-day made their debut in their School and College Magazines. I am very glad that this magazine will come out regularly and will serve a useful purpose.

With best wishes,

*Yours Sincerely*,

(S/d.) CHANNA REDDY.

Office of the Zilla Parishad,
Hyderabad District.
Dt. 16-1-1968.

I am glad to know that the Zilla Parishad High School Deveryamjal is bringing out it's first annual Magazine "UDAYA KAVITA:"

I hope the "Udaya Kavita" will help the young children to develop their minds and a sence of duties and responsibilities.

(S/d.) K. S. JOSEPH,
DY. SECRETARY (EDN.)
Zilla Parishad, Hyderabad District.

దివాకర్ల వేంకటావధాని, M. A. (Hons) Ph. D.
ఆంధ్రోపాధ్యాయుడు
ఉస్మానియా విశ్వవిద్యాలయము.

దేవరయాంజాల జిల్లా పరిషదున్నతపాఠశాల పక్షమున నీ యేడు ఉదయ కవిత యను వార్షిక సంచిక వెలువడుచున్నదని విని సంతసించితిని. సమర్థతతో నిర్వహింపబడుచో నీ పాఠశాలా పత్రికలు విద్యార్థులలో నిగూఢములై యున్న రచనాశక్తులను పెంపొందించి వారిని భవిష్యన్మహా రచయితలుగా రూపొందించు ననుటలో సందేహము లేదు. విద్యార్థులనుభవజ్ఞులైన యుపాధ్యాయుల సలహాననుసరించి భాషాభావములందుదాత్తములైన పద్య గద్య గేయ వ్యాసములను రచించి ఉదయకవిత నలంకరింతురనియు, ఉదయకవిత నిర్విఘ్నముగా నేటేట ప్రచురింపబడుచు విద్యార్థుల కుత్సాహము కలిగించుననియు విశ్వసించుచున్నాను.

—దివాకర్ల వేంకటావధాని.

మామిడి భోజిరెడ్డి.
అధ్యక్షులు
జిల్లాపరిషత్తు, హైదరాబాదుజిల్లా.

దేవర యాంజాల ఉన్నత పాఠశాల నుండి ప్రప్రథమముగా "ఉదయకవిత" యను వార్షికసంచిక వెలువడుచున్నదని తెలిసి మిక్కిలి సంతసించితిని. బాలురు తమ హృదయగత భావములను వెలువరించుటకు, వానిని రచింపబూనుటకు యిట్టి సంచికలు ప్రతి పాఠశాలయందును అవశ్యమైనవి. కవిత, కథ, నాటిక, గేయము మున్నగు ప్రక్రియలలో విద్యార్థిలోకమునకు ప్రవేశము కలుగుటయేగాక వారిలో నివురుగప్పిన నిప్పువలె నున్న శక్తులు వెలుగొందుటకు వార్షిక సంచికలు దోహద మొసంగును.

మీ "ఉదయకవిత" ప్రతి సంవత్సరము నిత్యనూతనముగా వెలువడుచు, క్రొత్త తీరు తెన్నులతో, వెలుగొందవలయునని ఆకాంక్షించుచున్నాను.

— M. Bhoji Reddy.



**SRI M. BHOJI REDDY,**

*CHAIRMAN*

Zilla Parishad, Hyderabad Dist.

**HE PLAYERS OF THE VOLLEY BALL TEAM (WINNERS) WITH THE MEMBERS OF THE SPORTS AND GAMES COMMITEE.**



**SCHOOL SCOUT TROOP**
**1967-68**



# STAFF MEMBERS



ng L. to R. :

1. Sri P. Venkata Reddy, B. A., LL. B.
2. Sri P. Srinivasa Rao.
3. Sri R. Ch. Sharma B. A., B. Ed.
4. Sri B. Anand Rao, (H. M.)
5. Sri M. Papa Reddy, B. A., B. Ed.
6. Sri T. Shamsingh.
7. Sri P. L. V. Yadiah.

nding L. to R. :

1. Sri G. Govindu.
2. Sri C. Narayan Reddy (Hindi Pandit.)
3. Sri Tirunagari (Telugu Pandit.)
4. Sri G. S. Seetharam, B. A.
5. Sri G. R. Nagabhushanam.
6. M. V. L. N. Chari, B. A.
7. Sri B. H. S. Varaprasad, M. Sc.
8. M. Sathyanarayana.

nding Second row L. to R. : 1. Sri B. Balashouri.

2. Sri K. Sudershan, (L. D. C.)
3. Sri P. Y. Vittal Reddy.
4. Sri S. Bala Sundar.
5. Sri Krishniah.

ing for Ground L. to R. :

1. Sri Krishan Sing (Watchman.)
2. Balaiah (Peon.)

# EDITORIAL BOARD



*Sitting L. to R.* :

1. Y. Indra Reddy, XI Class (Chief editor Telugu.)
2. Sri Tirunagari, (Telugu adviser.)
3. Sri B. Ananda Rao, B. Sc., B. Ed. (Head Master.)
4. Sri G. R. Nagabhushanam, (English adviser.)
5. Sri C. Narayana Reddy, (Hindi adviser.)

*Standing L. to R.* :

1. R. S. Anjaneyulu, XI Class (Hindi.)
2. G. Malliah, XI Class (Telugu.)
3. N. Laxmaiah, XI Class (English.)
4. B. P. Venkatesh, XI Class (English.)
5. M. Malla Reddy, X Class (Hindi.)

# పాఠశాల గీతము

చదువుకునే బాలురము
పదినాళ్లకు నేతలము
భరతమాత బిడ్డలము
ప్రగతిలోకి సాగెదము ॥చదువు॥

గౌతమ బుద్ధుని బోధల
కంఠమెత్తి పాడెదము
మాపవిత్ర వేదంబుల
నేషఠించి మించెదము ॥చదువు॥

గాంధీజీ బ్రతుకుబాట
బృందావన వీధిమాకు
నెహ్రూ మున్నగు నేతల
హితపలుకు పసిడిమాకు ॥చదువు॥

ప్రతిదినంబు పాఠాలను
పిల్లవేసి నైవేద్యము
వెలుగురికాదర్శముగా
నడిచి పేరు పొందెదము ॥చదువు॥



ఆటలతో పాటలతో
ఆనందము పొందెదము
బుద్ధిబలము దేహబలము
పొందిమేము వెలిగెదము ॥చదువు॥

యామిజాల ఉన్నతవిద్యా
లయములోన చదివెదము
మాగ్రామపు పేరునిలిపి
మంచిజగతి పెంచెదము ॥చదువు॥

చదువుకునే బాలురము
పదినాళ్లకు నేతలము
భరతమాత బిడ్డలము
ప్రగతిలోకి సాగెదము ॥చదు॥

# జయదేవ

ఎం. మల్లారెడ్డి, 10వ తరగతి

రత్నాలసీమయని వాసిగాంచిన భారతదేశము భూపాల రత్నములనేగాక కవిరత్నములను కూడా కని ధన్యమైనది. తులసీ, పోతన, కబీరు, మీరా మున్నగు కవులెందరో ఈ గడ్డపయిన వెలసిరి. వారిలో భక్త జయదేవుడు ఎన్నదగినవాడు. పోతన, మీరా, తాళ్ళపాక పెదతిరుమలాచార్యుల వలెనే జయదేవుడు తన జీవితమును భగవద్భక్తితోనే అంతమొందించెను.

ఈతని జీవిత విశేషముల నెరుగుటకు చంద్రదత్తుడు రచించిన భక్తమాల ముఖ్యాధారముగా నున్నది. ఈతని జన్మస్థానమును గూర్చి గీతాగోవిందములోను, కుంభరాణా రచించిన వ్యాఖ్యలోను, శంకరమిశ్రుని రసమంజరీ వ్యాఖ్యలోను విపులముగా వ్రాయబడినది. వీటన్నింటిని బట్టి జయదేవుడు 'కెంపుబిల్వ' మను గ్రామము జయదేవుని స్వగ్రామమని తెలియుచున్నది. ఈ గ్రామము వంగదేశమున నున్నది.

గీతాగోవిందములో పండ్రెండవ సర్గలోని పదునొకండవ శ్లోకమున, జయదేవుడు తన తండ్రి శ్రీభోజదేవుడనియు, తల్లి రామాదేవి అనియు చెప్పుకొనెను. కొన్ని ప్రతులలో రాధాదేవి అని కూడా నుడివెను. కాన తల్లిపేరు నిశ్చయముగా చెప్పలేము. ఏది ఏమైనను ఇతని తల్లిదండ్రులు ఇతని చిన్నతనములోనే మరణించిరని తెలియుచున్నది.

గోవర్ధనశ్చ శరణో, జయదేవ ఉమాపతిః
కవిరాజశ్చ రత్నాని, సమితౌ లక్ష్మణస్యచ ।

అను శ్లోకము వంగదేశమును పాలించిన లక్ష్మణసేనుని సభామంటపమందు కలదు. కావున ఇతడు 11వ శతాబ్ది ఉత్తరార్థమున కలవాడని ఊహింపవచ్చును.

జయదేవుడు మహాభక్తుడు. ఈతడు విద్యాభ్యాసము ముగిసి అచ్చట పురుషోత్తమార్యుని శిష్యుడాయెను. కిందుబిల్వమున దేవశర్మయను మరియొక బ్రాహ్మణుడుండెను. ఈతనికి పురుషోత్తముని అనుగ్రహమున పద్మావతి అను కూతురు కలిగెను. జయదేవుడు యుక్తవయస్కుడయ్యెను. అప్పుడు పురుషోత్తముడు దేవశర్మ కలలో కన్పడి అతని కుమార్తెను జయదేవునకిచ్చి వివాహము చేయుమని ఆజ్ఞాపించెను. దేవశర్మ పురుషోత్తముని ఆజ్ఞప్రకారము పద్మావతీ జయదేవుల వివాహము జరిపించెను. వివాహానంతరము జయదేవుడు గీతాగోవింద పఠనము చేయుగా పద్మావతీ భావ పరవశయై తదనుగుణముగా నృత్యము చేయుచు ఆనందముతో భగవచ్చింతనతో వారిరువురు కాలము గడుపుచుండిరి.

జయదేవుడు సుప్రసిద్ధ సంస్కృత కావ్యమగు గీతాగోవిందమును రచించెను. గీతాగోవిందము 12 సర్గల కావ్యము. ఇందు 24 గీతములు, 93 శ్లోకములు గలవు. వీనికి అష్టపదులని పేరు. జయదేవుని కవనము మృదు మధుర ధారగలది. ప్రథమ సర్గము నందలి వసంత వర్ణన జయదేవుడు చేసిన విధము సాహిత్యమునకు క్రొత్తబాట. గీతాగోవిందమునందు సంగీతమునకు రాగయుక్తముగా పాడుకొనుట కనువయిన గేయములు కలవు.

ఈతడు చిన్నప్పటినుండి పరలోక చింతన కలవాడై శ్రీకృష్ణునిపై అత్యంత భక్తి ప్రదర్శించుచుండెడివాడు. ఇతడు రచించిన ప్రతి కావ్యమునందు భగవద్భక్తి తొణికిసలాడుచుండెను. ఈతడు కావ్యమును వ్రాయుమొదలు, కావ్యమును

పూరించువరకు భగవంతుని దృష్టిలో నుంచుకొనె నని ఈ క్రింది విషయము తెలుపుచున్నది.

జయదేవుడు గీతాగోవిందమునందలి పదవ సర్గమునందు రాధను, కృష్ణుడు సాంత్వనమొనర్చు ఘట్టమును వ్రాయుచుండెనట. కృష్ణుడు రాధికతో "నీపాదమును నాశిరముపై నుంచుము", అనునట్లు జయదేవునకు భావస్ఫూర్తి అయ్యెను. సర్వేశ్వరుని విషయమును ఇట్టి భావమును రచనాబద్ధము మనస్సు ఒప్పుకొనలేదు కాబోలు అతడా విష నల్లేయుంచి స్నానమునకు పోయెను. ఆ సమయమున పురుషోత్తముడు జయదేవుని రూపములో వచ్చి పద్మావతిని అడిగి పుస్తకము తీసుకొని

స్మరగరళ ఖండనం మమ శిరసి మండనం
దేహి పాదపల్లవ ముదారమ్

అను చరణము వ్రాసి వెడలిపోయెనట. ఈతడిట్టి కావ్యమును పురుషోత్తమున కంకితము గావించెను. గీత గోవిందమునందు రాధా విరహము తెలుపు శ్లోకములందలి ఈ క్రిందిదొకటి

మాధవ మానసిజ విశిఖ భయాదివ
భావన యాత్వయి లీనా
సావిరహే తవదీనా

ఈ విధముగా ఇతడనేక శ్లోకములను వ్రాసెను. గీతా గోవిందమున వర్ణనయందీతడు చూపిన నేర్పు అద్వితీయము. రాధ విరహిణి, ఆమె కృష్ణునికై బృందావనమున పడిన తపనను జయదేవుడు రమణీయముగా వర్ణించినాడు.

ఇట్టి జయదేవుని లీల లమోఘము. ఈతని లీల లనేకము కానగును. ఆ కాలమున జయదేవుని గీతా గోవిందముపై ప్రజలకు నానాటికి విశ్వాస మధికమగు చుండెను. ఇదిచూచి ఆనాటి రాజు అసూయచెంది అతడొక గీతాగోవిందమును వ్రాసి ప్రజలందరు చదువవలెనని శాసించెనట. కాని జయదేవుడు శాసనము నుల్లంఘించగా రాజు కోపించి అతనిని పిలచి అడిగెను. జయదేవు డప్పుడీవిధగా చెప్పెనట. రాజా నీగ్రంథమునే పఠించుటకు అభ్యంతరములేదు. కాని భగవంతుడు నా గ్రంథమునకు సంతోషించునటుల నీ గ్రంథమునకు సంతోషించుటలేదు. కావలసిన ఈ విషయము నతనివల్లనే తెలుసుకొనుమనెను. అప్పుడు రాజు తన గ్రంథమును; జయదేవుని గ్రంథమును జగన్నాథుని ఎదుట నుంచి నీకేది ఇష్టమో దానిని పైన నుంచుమని దేవుని ప్రార్థించెను. అర్చకులు తాళము వేసి కొంతదూరము పోయిరి. కొంత సేపయిన తరువాత తలుపులు తెరచి చూచిరి. జయదేవుని గీతాగోవిందము పైన ఉండెను.

దీనినిబట్టి భగవంతునిపై ఈతనికిగల విశ్వాసము భగవంతునికి జయదేవునిపైగల కరుణ తేటతెల్లమగుచున్నది.

ఈ విధముగా జయదేవుడు సాహిత్య సేవనే గాక భగవద్భక్తులకు సంస్కరణీయు డయ్యెను. ఇట్టి బిడ్డను కనిన మన భారతభూమి ఎంతయో ధన్యమయినది. అతని కథ విననోచుకొనిన మన మెంతయో అదృష్టవంతులము.



# గాంధీ సంస్మృతి

బి. యుద్ధంరెడ్డి, 11వ తరగతి

ఆధునిక యుగములో జీవించిన మహాపురుషులలో గాంధీమహాత్ముడు ఒకడు. ఆయన తండ్రి పేరు కరంచందు. తల్లిపేరు పుత్లీబాయి. అటువంటి పుణ్యదంపతులకు మహాత్ముడు 1869 అక్టోబరు 2 న పోర్బందరు నందు జన్మించెను. గాంధీజీ పోరుబందరులోనే అక్షరాభ్యాసము చేసెను.

గాంధీజీకి 13 వ యేటనే కస్తూరిబాయితో వివాహమయ్యెను. గాంధీజీ అనేకసార్లు చదువులో బహుమతులను పొందగలిగెను. విదేశ విద్యాభ్యాసమునకు వెడలుటకు ముందు మాంసము, మద్యము, మగువ ఈ మూడింటిని ముట్టనని తల్లి పాదములంటి ప్రమాణము చేసినాడు. 1888 సెప్టెంబరు 4 వ తేదీన బొంబాయినుంచి ఓడలో బయలుదేరెను. అంతకు కొన్ని నెలలముందు కస్తూరిబాయి మగబిడ్డను ప్రసవించినది. 'హీరాలాల్' అని పేరుపెట్టిరి. గాంధీజీ లండను చేరిన మొదటిరోజుననే డాక్టర్ మోహత్ దర్శనము లభించెను. యూరోపియన్ మర్యాదకు సంబంధించిన నాలుగు ముఖ్యసూత్రములను డా. మోహత్ గాంధీజీకి బోధించెను.

1. ఇతరుల వస్తువులను తాకవద్దు.
2. ప్రథమ పరిచయ సమావేశములో ప్రశ్నలు వేయవద్దు.
3. బిగ్గరగా మాట్లాడవద్దు.
4. 'సర్' అని సంబోధించవద్దు.

1888 నవంబరు 6న గాంధీజీ ఇన్నర్ టెంపుల్‌లో చదువు ప్రారంభించెను 1890 జూన్‌లో లండన్ యూనివర్శిటీ మెట్రిక్యులేట్ అయ్యెను. 1891 జూన్ 11 న హైకోర్టులో బారిష్టర్ల జాబితాలో పేరు నమోదు చేయించుకొనెను. గాంధీ లండను నుండి బొంబాయికి వచ్చి ఓడదిగిన వెంటనే తల్లియగు పుత్లీబాయి మరణవార్తను విని విచారపడెను.

గాంధీజీ 1893 మే 22 న "నేటాల్ ఇండియా కాంగ్రెసు"ను ఏర్పరచెను. 1903లో గాంధీజీ దక్షిణాఫ్రికాలోని సత్యాన్వేషకుల సమాజమున పాల్గొనెను. 1917 సంవత్సరమున ఖేడా జిల్లాలో పంటలుపోయి కరువు యేర్పడెను. 1919 అక్టోబరు 17 పిమ్మట పంజాబులో ప్రవేశించుటకు గాంధీజీకి ద్వారము తెరువబడలేదు.

1920 జులై 31 న తిలక్ నిర్యాణము చెందుటతో కాంగ్రెస్ బరువు గాంధీజీ చేతులలో పడినది. 1922 మార్చి 10 న రాత్రి 10 గం. 30 ని. లకు రాజద్రోహ నేరముపై అరెస్టు చేయబడెను. 1930 ఏప్రిల్ 6 న గాంధీజీ సముద్రపు నీటిలోని ఉప్పు గుప్పిట పట్టి చట్టమును ఉల్లంఘించెను.

1933 వ సంవత్సరమున గాంధీజీ జైలులో ఉండియే "హరిజన సేవక సంఘము"ను స్థాపించెను. 1934 జనవరి 15 న బీహారు రాష్ట్రము భూకంపమువలన శ్మశానవాటిక యైనది. మహాత్ముడు ప్రజలలో ధైర్యమును నిలబెట్టి పునర్నిర్మాణ కృషి దోహదమొనర్చెను. అక్టోబరు 24 న అఖిలభారత గ్రామ పరిశ్రమల సంఘము స్థాపించబడినది. 1942 అగష్టు 8 న బొంబాయిలో అర

రాత్రిన అఖిలభారత కాంగ్రెసు సంఘము 'క్విట్ ఇండియా' తీర్మానమును ఆమోదించినది.

విక్టోరియా రాణి మునిమనుమడు అగు మౌంటు బాటెన్ 1947 మార్చి 22 న మనదేశమునకు 20 యవ వైస్రాయిగా వచ్చెను. క్రొత్త ఇండియాలో నాకు స్థానములేదు. 125 సంవత్సరములు జీవించవలయునని ఆశ అంకురించినది. అని అన్నాడు గాంధీ. 1947 ఆగష్టు 15 వ ఇండియాకు సంపూర్ణ స్వాతంత్ర్యము లభించినది.

1948 జనవరి 30 సాయంత్రము 4 గం. 30 ని. లు అయినది. గాంధీజీకి ఆభా పండ్లు, పాలు అమర్చిపెట్టినది. అదే ఆయన ఆఖరి ఆహారము. పటేల్‌తో మంతనములాడుటలో అప్పటికే 10 ని. లు ఆలస్యమైనది ప్రజలందరు భక్తితో లేచి అంజలి పట్టిరి. ఒకడు సాష్టాంగ దండప్రణామము చేయువానివలె నటించెను. కానీ నెక్కరు జేబులో గుప్తముగా ఉంచుకొన్న ఆటోమాటిక్ పిస్తలు బైటకి తీసెను. గాంధీజీకి గురిపెట్టి గ్రుండ్లు పేల్చెను.

అంతయు మెఱపు మెరసినంతలో జరిగిపోయెను. మహాత్ముడు హే రామ్! హే రామ్! అని నేలకొరిగెను. గాంధీజీ శరీరము బిర్లా మందిరము చేర్చబడినది. నెహ్రూ, పటేల్ మహాత్ముని పాదములపైబడి దుఃఖించిరి.

మరునాడు మధ్యాహ్నము 12 గంటలకు యమునానది ఒడ్డుననున్న రాజఘాట్‌లో చితి యేర్పరుపబడినది. గాంధీ మహాత్ముడు, బుద్ధుడు, మహమ్మదు, ఏసుక్రీస్తు కోవకు చెందినవాడు. గాంధీజీ స్వాతంత్ర్యము సిద్ధించిన ఐదున్నర నెలలకే పరలోకగతుడగుట భారతదేశమునకు తీరని లోటు. ఆయన జీవిత చరిత్రయే భారతదేశ స్వాతంత్ర్య చరిత్ర. దేశమునకు, స్వాతంత్ర్యము సాధించిన నాయకునకు అవినాభావ సంబంధము చిరకాలము నిలిచియుండును. అంధ అఖిలభారతజాతికి, అనంతకాలాలవ నిలచియుండగలదు.



## తిరునగరీయం

— తిరునగరి —

మంచి వలయునంచు కంచు ఢక్కాగొట్టి
పలుకువారు మాట నిలుపలేరు
మంచి ఎడద లేక మాటలపచ్చునా
తిరునగరిదిమాట తిరుగులేదు.

పాలకుండు గట్టివాడైన ప్రజలెల్ల
భయము, భక్తితోడ బ్రతుకగలరు
రాజు అబలయైన ప్రతియొక్క డొకరాజు
తిరునగరిదిమాట తిరుగులేదు.

దోషమెంతదైన దోషము నేరమే
నేరమునకు శిక్ష నెగడితీరు
కాన బ్రతుకుబాట కావలెజ్ఞానంబు
తిరునగరిది మాట తిరుగులేదు.

జంధ్యమున్నయంత సత్వంగుడెబ్లౌను
కత్తిబట్టినంత గాడుజోదు
అసలుప్రతిభకలుగ ఆడంబరాలేల
తిరునగరిదిమాట తిరుగులేదు.

మనిషి, మనిషి మేను పెనవేసికొనినంత
మమత పెడదనుండు మాటకల్ల
ఆత్మశుద్ధిలేని ఆలింగనములేల
తిరునగరిదిమాట తిరుగులేదు.

కష్టమెంతయున్న కర్తవ్యపాలన
చేయువాడు లక్ష్యజీవిసుమ్ము
మబ్బులడ్డమైన మానునా రవికాంతి
తిరునగరిది మాట తిరుగులేదు.



# ఆధునిక విద్యార్థి



జి. మల్లయ్య, 11 వ తరగతి

విద్యార్థియనగా విద్యనర్థించువాడని యర్థము. ఆధునిక విద్యావిధానమునకు పూర్వపు విద్యా విధానమునకు చాల భేదములు గలవు. ప్రాచీన కాలమున విద్య నేర్చుకొనుటకు అన్ని జాతులవారికి అనుమతి లేకుండెను. కేవలము బ్రాహ్మణులకు, రాజపుత్రులకు మాత్రమే విద్యార్హతలుండెను. అట్టి ఉన్నతకుటుంబములోని తల్లిదండ్రులు తమ పిల్లలను బాల్యమునవే గురువునకు యప్పగించు చుండిరి. గురువు చెప్పినట్లు ఆ విద్యార్థులు నడచి, విద్య నార్జించెడివారు. విద్య పూర్తి కాగానే గురువుయొక్క ఆశీర్వాదములు పొంది తల్లిదండ్రుల వద్దకు పోయెడివారు.

అటువంటి విద్యావిధానము నేడు ఎచ్చటను కనిపింపదు. నేటి కొందరు విద్యార్థులు విద్యార్థి యను తమనామమును సార్థకము చేసుకొనలేక పోవుటయేగాక తమ తల్లిదండ్రులకు చెడ్డపేరును తెచ్చుచున్నారు. నేటికాలమున అన్నిజాతులకు విద్యార్హత లొసంగబడినవి. విద్యార్థులకు ప్రభుత్వము అనేక సదుపాయములు కలిగించుచున్నది. హరిజనులకు ప్రత్యేకమైన ఉపకారవేతనములు ఇచ్చుటకు, ఫీజు రద్దుచేయుటకు ప్రభుత్వము ఎన్నో విధములుగా సహాయము చేయుచున్నది. ఉత్తమ శ్రేణిలో ఉత్తీర్ణులైన విద్యార్థులకు, బీద విద్యార్థులకు ఉపకార వేతనములను ప్రభుత్వము యిచ్చుచున్నది. ప్రతి గ్రామములోను పాఠశాలలను నిర్మించుటకు ప్రభుత్వము ధనసహాయము చేయుచున్నది. కనుక మనము ప్రభుత్వము కల్పించుచున్న సదుపాయములను గ్రహించి, బాగుగా చదువుకొనుటకు ప్రయత్నించుకొందము

కొందరు విద్యార్థులు చేష్టలవలనను, మాతృభాషగాని ఇంగ్లీషు భాషవలనను విద్యార్థుల బుద్ధి సూక్ష్మత తగ్గుచున్నదని చెప్పవచ్చును. ఇంగ్లీషు సరిగా అర్థము గాకపోవుటవలన బట్టీపెట్టి పరీక్షలలో ఉత్తీర్ణుడగుట సంభవించుచున్నది. అట్టి విద్యార్థులను ఉపాధ్యాయులుగాని, ఇతర విద్యార్థులు గాని హేళన చేయుట జరుగుచున్నది.

నేడు కొందరు విద్యార్థులు విద్యావిషయములలో అశ్రద్ధ చూపుచున్నారు. యేదైన ఒక క్రొత్తచిత్రము విడుదలయైనచో, కొందరు విద్యార్థులు పాఠశాలకు వెళ్లక చివరకు పరీక్షలనైనను విడిచి చిత్రమును చూచుటకు సిద్ధమగుచున్నారు.

ముఖ్యముగా పట్టణ విద్యార్థులకంటె గ్రామ విద్యార్థులలో విద్యాజ్ఞాన మెక్కువగా నున్నదని చెప్పవచ్చును. పట్టణ విద్యార్థులలో క్రమశిక్షణ యుండదు. ఉపాధ్యాయుడు పాఠము బోధించుచుండగనే కొందరు విద్యార్థులు ఉపాధ్యాయుని ఆజ్ఞ తీసుకొనక తరగతి వెలుపలికివచ్చి సినిమాకు పోవుటయో, యెవరికైన జేబులు కొట్టివేయ ప్రయత్నించి అవమానముల పొందుదురు. చివరకు తమ పుస్తకములను అమ్మియైనను చిత్రములకు, హోటళ్లకు పోవుట జరుగుచున్నది. పుస్తకములు లేక పరీక్షలలో ఉత్తీర్ణులు గాకపోవుట జరుగుచున్నది. కొందరు విద్యార్థులు పుస్తకము లుండియూ గూడా ఇంటికిపోయిన తరువాత పుస్తకములు తెరచియైనను చూడరు. సాయంకాల సమయమునకు పార్కులలోనికి పోయి వ్యర్థ సంభాషణలు జరుపుచు, సిగరెట్లు పీల్చుట వారికొక అడంబరమైనది. కొద్దిమంది విద్యార్థులు మాత్రము ప్రభుత్వము కల్పించుచున్న సదుపాయములను గ్రహించి చక్కగా చదువుకొనుటకు ప్రయత్నించుచున్నారు. అట్టి విద్యార్థులకు అనేకమంది అనేకబాధలు కలిగింతురు. అట్లు అనేక

బాధలకోర్చి, కష్టపడి చదువుచు, ఇతరుల హేళన లను లెక్కచేయనివారు తప్పక పైకివత్తురు.

గ్రామములందు విద్యార్థులు ఉపాధ్యాయులపై తిరుగబడకుండ ఉపాధ్యాయుడు చెప్పినట్లు విని తన చదువుపై అధిక శ్రద్ధ నుంచుదురు. గ్రామములలో సినీమాలు, పార్కులు, అందుబాటులో లేనందున అటువంటివాటి జోలికిపోక తాము తప్పక పరీక్షలలో ఉత్తీర్ణులగుటకు ప్రయత్నింతురు. గ్రామములలోని విద్యార్థులు ఉపాధ్యాయులపై తిరుగబడకుండుటచే, ఉపాధ్యాయుడు తన శక్తికి మించునట్లు విద్యార్థుల జ్ఞానాభివృద్ధికి తోడ్పడును. గ్రామ విద్యార్థులలో క్రమశిక్షణ యుండును. ఇతరులకు నష్టముచేయకుండ తమ పనిని తాము చూచుకొందురు. అందుచేత పట్టణ విద్యార్థులకంటె గ్రామ విద్యార్థులలో విద్యాజ్ఞాన మెక్కువగా నున్నదని నొక్కి చెప్పవచ్చును.

చాలావరకు సామూహికవిద్య (Co-eduction) పాఠశాలల్లలో విద్యార్థులు, విద్యార్థినులు నీచమునకు పాల్పడుచున్నారు. తమ విజ్ఞానాభివృద్ధికి పాటుపడక తప్పుడు త్రోవలను త్రొక్కుచున్నారు.

"ఆడపిల్లలున్న తరగతిలోనున్న విద్యార్థి తన ప్రతాపం చూపి, వారిదృష్టి ఆకర్షించుకోవడానికి అల్లరిచేయడం, ఉపాధ్యాయుని ధిక్కరించటంవంటి వికృత చర్యలకు పాల్పడుతూ ఉంటాడనీ, అక్కడ నుంచి క్రమశిక్షణ దెబ్బతిన నారంభిస్తుందనీ" ప్రముఖ విద్యావేత్త బందరు నోబులు కళాశాల ప్రిన్సిపాల్ శ్రీ ఎ. ఎఫ్. త్యాగరాజు పేర్కొన్నారు.

విద్యార్థులకు, విద్యార్థినులకు వేరువేరు పాఠశాలలుండేటట్లయితే విద్యాప్రమాణాలు ఉన్నత స్థాయిలో నుండగలవని, రోమన్ కథాలిక్ విద్యా సంస్థలలో విద్యాప్రమాణాలు అధికంగా ఉండడానికి అదొక కారణమని శ్రీ త్యాగరాజు అభిప్రాయ పడుచున్నారు.

తరగతిలో ఉపాధ్యాయుని హేళన చేయుట వలన ఆతడు విద్యార్థులకు ఎన్నో విషయములు చెప్పదుననుకొని వారి హేళనచే నిరుత్సాహము చెంది విద్యార్థులకు సరియైన విషయములను చెప్పలేక పోవుచున్నాడు. ఉపాధ్యాయుడు సరిగా చెప్పకపోవుటవలన ఎవరికి నష్టము? విద్యార్థులకు. కనుక విద్యార్థులు ఉపాధ్యాయులను హేళన చేయుట మానుకొని తమ విజ్ఞానాభివృద్ధికై పాటు పడగలరని నేను ఆశించుచున్నాను.

నేడు కొన్ని చిత్రములవల్ల విద్యార్థులు తప్పుడు త్రోవలను త్రొక్కుచున్నారు సినీమాలో నాయికా నాయకులు చేసినట్లు కొందరు విద్యార్థులు చేయబోయి నవ్వులపాలగు చున్నారు. నేటి కాలమున దేశభక్తి, జాతీయతగల, నీతి బోధకము లగు సినీమాలకు విలువలేకుండ పోవుచున్నది. కొందరు విద్యార్థులతోపాటు విద్యార్థినులుగూడా తప్పుడు తోవలను త్రొక్కుచున్నారు. కాబట్టి విద్యార్థి, విద్యార్థినులు తప్పుడు త్రోవలను త్రొక్కక దేశ పురోభివృద్ధికి దోహద మొనర్చ వలసి యున్నది.

కొందరు విద్యార్థులు తమ పాఠ్య పుస్తకములపై శ్రద్ధనుంచక నవలలు, నవలేతరములు (సినిమారంగములు, విజయచిత్రలు) డిటెక్టివ్‌లు చదువుచున్నారు. అట్లు చదువుట మంచిదేకాని అందులోని మంచి విషయములను గ్రహించి, తప్పుడు త్రోవలను త్రొక్కు విషయములను విసర్జింపవలయును. కాని ఈవిధముగా చేయువాడు నేడు యే నూటిలో ఒక్కడు కూడా లేడేమో! కావున అట్టి దుర్గతిని తొలగించుటకు విద్యాలోకము పూనుకొనవలెనని ఆశించుచున్నాను.

కనుక విద్యార్థులు "నేటి విద్యార్థులు రేపటి పౌరులు" అని గ్రహించి తమ జ్ఞానాభివృద్ధికి తోడ్పడుదురుగాక!

# దేశము - మన బాధ్యత

జి. భగవంతరెడ్డి, పదవ తరగతి

దేశమనగా మనము పుట్టి పెరిగిన మాతృభూమి. మాతృదేశమనగా మన కన్నతల్లి వంటిది. మనకు ఉన్నతల్లికి ఎట్టి కష్టముగాని, బాధగాని కలుగుచున్నప్పుడు మనకేవిధముగా బాధకలుగునో మనదేశమునకు గూడ ఏదైన క్లిష్టపరిసితి సంభవించి నప్పుడు అంతేబాధ కలుగును. జనని కన్నజనని మాతృమూర్తి దేశము.

మనదేశమునకు రక్షణ చాల అవసరము. చైనా, పాకిస్తాన్ దేశములను ఏమియు చేయలేక పోవుచున్నాము. తరువాత కొంతకాలము నమ్మించి దెబ్బతీయవచ్చును. అందువలన దేశమును యిట్టి దాడులనుండి కాపాడుకోవలయు నన్న దేశమును మిక్కిలి సమర్థవంతముగా చేయ వలసి యుండును. అట్లు పరిణమించుటకు అధికోత్పత్తి దానికితోడు సైనిక పటిష్టత ఎంతైనను అవసరము. ఆయుధములను యితర దేశముల నుండి తెప్పించుకోవలయునన్న చాల ధనము కావలయును. ధనములేని మనము ఆర్థికముగా అనేక క్లిష్ట పరిస్థితులను నెదుర్కొనుచున్నాము. మనమే స్వయముగా మారణాయుధములను తయారుచేయు ఫ్యాక్టరీలను నిర్మించుకొన వలయును. మరియు అణుశక్తి కేంద్రాలను గూడ కొన్నింటిని స్థాపించిన బాగుండును. ఈ దృష్టితోడనే భారత ప్రభుత్వము తారాపూర్ లో అణు విద్యుదోత్పక కేంద్రమును స్థాపించినది. వలసిన ఆయుధములను మనమే తయారు చేసుకొనుటవలన స్వయముగా యితరదేశములనుండి వానిని తెప్పించ వలసిన అవసరముండదు.

దేశ రక్షణకు ఆయుధములు ఎంత ముఖ్యమో, వాటిని ఉపయోగించు సైనికులు కూడ అంత ముఖ్యము. దేశము నలుమూలలనుండి ప్రజలను సైన్యములో చేర్చుకొని వారికి సమర్థులైనవారి చేత శిక్షణనిచ్చి సమర్థులైన దేశభక్తులనుగా చేసిన వారే ముందు ముందు దేశమునకు ఎట్టి క్లిష్ట పరిస్థితులందైనను శత్రువులను ఉగ్గుచేయ సాహసింతురు. ఇదియేకాక అవసరమునుబట్టి ఉపయోగించుటకు గాను ప్రతి ఉన్నత పాఠశాలలోను కళాశాలలోను చదువుకొను విద్యార్థులకు N C C and A. C. C అను సంస్థలద్వారా. చైనా సైనిక శిక్షణ నిచ్చుటకు జరుగుచున్నది. కాని, ఇది అంత శ్రద్ధగా పనిచేయుటలేదు. ప్రభుత్వ విషయమున ఇతోధిక శ్రద్ధ గైకొన వలయును. దేశరక్షణతో గ్రామముల సహాకారము యెక్కువ అవసరము. కర్షకులపై పన్నుల భారమును మోపి కృంగనీయక ప్రోత్సహించి అధికోత్పత్తికి దోహదము చేయవలయును. స్వర్గీయ ప్రధాని శాస్త్రి అన్నట్లు సైనికుడు శ్రామికుడు ఇరువురు దేశ ప్రగతిరథమునకు చక్రములు. సుమారు 50 కోట్ల సంఖ్యగల దేశ ప్రస్తుత పరిస్థితిని సమస్యలను పరిష్కరించుటకు ప్రతి పౌరుడు ముందంజ వేయవలెను.

జై హింద్

# మా ఊరు

రచన
ఎం. ఆనందం, 11 వ తరగతి

మా గ్రామము దేవర్ యాంజాల. ఇది మేడ్చల్ తాలూకాకు నాలుగు మైళ్ళ సమీపమున నున్నది. ఈ గ్రామము నందు 101 విగ్రహములు, 101 బావులు, 101 కుంటలు ఉండుటచే ఈ గ్రామమునకు దేవర్ యాంజాల అను పేరు వచ్చినదని ప్రశస్తి కలదు.

మా గ్రామములో శ్రీరాముని దేవాలయము కలదు. ఇందులోని మండపము చాల అందముగా నున్నది. ఈ మండపముయొక్క స్తంభములపై చక్కని శిల్పములున్నవి. ఈ శిల్పములు 16 వ శతాబ్దమువాటి శిల్పములను బోలియుండును. ఈ దేవాలయ మంతయు రాతి కట్టడము. ఇది ఏకాలమున నిర్మించబడినదో తెలియకున్నది. దీని యొక్క ఎత్తైయున గోపురముపై అనేకరకముల చిత్రములున్నవి. మండపము ఎడమప్రక్కన పుష్కరణి కలదు. ఆ పుష్కరణి మిక్కిలి సుందర నిర్మితమై యున్నది. ఇట్టి దేవాలయ పుష్కరుణులు మన రాష్ట్రమున క్వాచిత్కములు. పుష్కరిణి చుట్టు 32 చిన్న చిన్న ఆలయములు గలవు. అందులోని విగ్రహములు అందముగా చెక్కబడినవి. కాని కాలప్రవాహమున దుర్మార్గులకరమై అవి శిథిలములైనవి. సీతా రామ లక్ష్మణుల మూల విగ్రహములు చూడముచ్చటగా నున్నవి. ఇచ్చట ప్రతి సంవత్సరము రథోత్సవము జరుపుచుందురు. ఇది ప్రతి ఏడాది చైత్రశుద్ధ త్రయోదశినాడు జరుగును. చైత్రశుద్ధ నవమి మొదలుకొని చైత్ర శుద్ధ త్రయోదశి వరకు ఉత్సవములు అతి వైభవముగా జరుగును. ఇచ్చటి గ్రామ ప్రముఖులు గ్రామ సర్వతోముఖాభివృద్ధికై సహాయము చేయుచున్నారు.

ఈ గ్రామములో 11 వ తరగతివరకు గల ఉన్నత విద్యాలయము కలదు. పాఠశాలయందలి విద్యార్థులు గ్రామముయొక్క కీర్తిని సంపాదించుటకు గాను గత సంవత్సరము వివిధ క్రీడలయందు, తాలూకాయందును, జిల్లాయందును ఆటలలో ప్రథమ బహుమతిని పొందిరి. మా గ్రామము యందలి బావులకు, విద్యుచ్ఛక్తి సరఫరా చేయబడినది. ఇచ్చటి రైతులు పంటలు పండించుట యందు నేర్పుకలిగియుండిరి. ప్రభుత్వము ఎరువుల సహాయముకూడా చేయుచున్నది. రైతులు అత్యధికముగా పంటలను పండించుటవలన మా గ్రామమందలి ప్రజలకు ఆహారములో కొరతలేదు. సాయంకాలము కాగానే విద్యుద్దీపములతో ప్రతి గృహము కళకళలాడుచుండును. ప్రజల కష్టసుఖములను గుర్తించి ప్రభుత్వమువారు మా గ్రామమువరకు ఆర్. టి. సి. బస్సులను నడుపుచున్నారు. ప్రజల విజ్ఞానము నభివృద్ధి పొందుటకు గాను ప్రభుత్వమువారు ప్రాంతీయ గ్రంథాలయము నేర్పరచినారు. ఇచ్చట నీటి సౌకర్యము లేదు. కల్పించుటకై ప్రభుత్వము కుళాయీలను ఏర్పరచినారు. తంతి, తపాల సౌకర్యములున్నవి. మేడ్చల్ తాలూకాలోని గ్రామములలో దేవర్ యాంజాల ప్రగతిపథమందున్నది.

అన్ని రంగములందు విశేష కృషిచేసి సత్ఫలితములను సాధించుచున్న మా గ్రామముగూర్చి వ్రాయుట దోషముకాదనుకొందును. చరిత్రజ్ఞులకు, పరిశోధకులకు యిచ్చటి స్థానిక దేవాలయ చరిత్రను సేకరించి ప్రకటించగలరని మనవిచేయుచున్నాను.

---

ఏదేశమేగినా – ఎందుకాలిడినా – పొగడరా నీతల్లి భూమిభారతిని.
(రాయప్రోలు)

# భిన్నత్వాలు



(సాంఘిక చర్చ)

బి. భారతి, పదునొకండవ తరగతి

"లోకోభిన్నరుచి" అన్నట్లు ప్రతి మానవునకు ఏదేని ఒక అత్యముపై అభిరుచి ఉండకతప్పదు. ఆ అభిరుచిని అమలులో పెట్టాలని ప్రయత్నిస్తుంటాడు. కాని యిట్టి ప్రయత్నమునకు ప్రయాణమునకు ముల్లు గ్రుచ్చుకొనినట్లు కొందరు హేళన చేయుదురు. మరికొందరు తగిన ప్రోత్సాహమిచ్చి ఆ ప్రయత్నమును నిష్ఫలము కాకుండ ప్రోత్సాహమిత్తురు. ఇందులో రెండవ కోవకు చెందినవారు గౌరవనీయులు.

ఒకవ్యక్తికి కోకిలవంటి గొంతువుంటుంది. కాని ఏమి లాభము? ఆ గాయకునికి తగిన గౌరవము లభించవలయును. "కొలని హంసలకడ కొక్కెర నిలచి నట్లున్నచో" కళాకారు డనబడడు. అతడు అతని గానమును విని తన కళలో పూర్ణ ప్రజ్ఞ సంపాదించాలి.

అదివిని అసూయ చెందేవారు కొందరు. అభివృద్ధిలోకి వచ్చేవారు మరికొందరు. ఈకాలంలో మొదటి వర్గమువారే ఎక్కువగా ఉన్నారంటె అతిశయోక్తి కాదు. "గోముఖ వ్యాఘ్రాల" వలె పైకి మంచిచూపులతో లోన కౌటిల్యముతో చూస్తూంటారు. ఈ విధముగ కళాజీవిని గౌరవించు వారు లేక అతడు అభిరుచిని అణచివేసుకొనవలసిన పరిస్థితి ఏర్పడుతుంది. వానివలె మనముకూడ పాడుచున్నపుడు "అనగ ననగ రాగ మతిశయిల్లుచునుండు" అనునట్లు గాయకుల మవుతామని మరికొందరు అట్టి కళకు కళాకారునికి తగిన గౌరవమిచ్చి తాముకూడ ఆ అభిరుచిని అలవరచుకుంటారు.

"నీకు పాట పాడుట అనునది పుట్టుకతో రాలేదురా" అని కొందరు నిరుత్సాహము కలుగునట్లు చేయుదురు. అంతటితో యీ ప్రయత్నమును మానరాదు. పాడరానివాడు యిలాగే పాడుట ప్రారంభించినచో వేమన పద్యమును అక్షరాల అనుభవించ వచ్చును.

ఏదికాని అమలులో పెట్టనిచే అందులో కృతకృత్యులము కాలేము. ఇది అనాదినుండి నేర్చుకుంటున్న పాఠమే.

తన సాధనమే తన లోకనాటికి గౌరవము తెచ్చిపెట్టును. ఇప్పుడు పరిహసించెవారు రేపు గౌరవిస్తారు. ఇది లోకంలో సహజం. అందుకే సాధన చాలా అవశ్యము.

అదేవిధముగ ఒకడు కవి కావాలని అనుకుంటాడు. కాని అతడు వ్రాసిన కథయో గేయమో ఏదోఒకటి వ్రాసినాడా యిక వానినికలము పట్టకుండ చేయుదురు. "ఓ వచ్చాడురా పండితుడు!" అని ఒకవంక వెక్కిరింపులను ఎదుర్కొనవలసి వస్తుంది. ఇవి సహజంగ హృదయమున కెంతో బాధ కలిగిస్తాయి. అంతటితో మనిషి "యిన్ఫీరియర్"గా క్రుంగిపోరాదు.

కవిత్వము వ్రాయుటకు మరికొందరు "బాబు యిలాగే చిన్నచిన్నగా వ్రాస్తుంటేనే పెద్ద సమస్యలను గూర్చి వ్రాయగలవు" కాని "విత్తనములను పెట్టగానే పూలుపూసి ఫలములను యివ్వాలి అన్నచో మనవల్లకాదు" అది మొలకెత్తి ఆకులతో కొమ్మలతో శాఖోపశాఖలుగ వ్యాపించి పూవులను, ఫలములను యివ్వగలుగును. అదేవిధముగ నీవుకూడ క్రమక్రమముగ భావాలు పెరిగి నిన్నొక మహాకవిగా చేసి నీకీర్తిని దిగంతముల వరకు వ్యాపింప చేయునని చెబుతారు. తగిన ప్రోత్సాహము

లభించుటవలన చివరికి ఏమి రానివారైన యింతో అంతో ప్రయత్నిస్తారు. ఇక ఇతరులను గేలి చేయువాడు తాను నేర్వడు. ఇతరులను నేర్వ నివ్వడు. దుష్టునికి దూరముగా నుండవలయు నన్న మాటనే జ్ఞప్తిలో ఉంచుకొని సాధకుడు ముందడుగు వేయాలి. కావున మనము ఎల్లప్పుడు ద్వేషభావాలతో మెలగరాదు. ఏమీరాని అమాయ కులకు (అజ్ఞాని) కూడ ప్రోత్సాహమిచ్చి వానిని తీర్చిదిద్దిన వారున్నారు. కాని ప్రయత్నములకు అడ్డుతగిలి ఒకని కళావికాసమును మట్టిలో కలియు నట్లు చేయరాదు. అంతియేకాదు మానవునికి దేనిపై అభిరుచి ఉంటుందో దానికిగల అభిరుచికి తగిన గౌరవమియ్యవలయును. ఒకనికి కీడు తల పెట్టిన అది దుర్యోధనుని ఘోషయాత్ర ఫలిత ముగా పరిణమించును. కావున మనము చేయి చేయిని కలిపి ఐకమత్యమును కలిగి ఆదర్శముగ మెలగవలయును.

ఏమైననూ జగత్తులో రెండు తెగలకు చెందిన మనుష్యులుంటారు. అందుకే సుప్రసిద్ధకవి

ఆరుద్రగారు

"మంచివారని, చెడ్డవారని
మనలో జాతులు రెండు" అంటారు.

ఇవే మనలో భేదాలు.



# మరపురాని ఘట్టము

ఒక నగరములో ఒక ధనవంతుడుండెను. అత నికి ఒక చిన్న కూతురుండెను అతడు తరచు సినిమాకు వెళ్ళుచుండెను. ఒకనాడొక నగరము నకు వచ్చెను. మూడు ముక్కలు చెప్పి మూడు వేలు తీసుకొందునని అతడు చాటించెను. ఈ విష యము రాజు వినెను. వెంటనే అతడు బయలు దేరి వస్తాదు వద్దకు చేరెను అతనికి మూడువేలు ఇచ్చి ఆ మూడు ముక్కలు తెలుపమని కూర్చుం డెను. ఆ వస్తాదు "ఎవరైనకాని ఆలోచించి గుర్తెరిగి పనిచేయవలెనని భావము నిచ్చే మాటలు చెప్పెను. అతడు తన మనస్సులో, అరే ఈ ముక్కలు నాకు తెలియనివా అని అనుకొనెను. మరల ఆ వస్తాదును పైసలు అడిగిన ప్రజలు హేళన సేతురని ఎంచి ఊరుకొనెను. ఈ మూడు వేలు 8 గంటలలో సంపాదింతునని అనుకొనెను.

అతడు ఒకనాడు సినిమాకు పోవుచుండగా అతని కూతురుకూడా వెంబడిపడెను. అతడు నిరాక రించెను. అతడు సినిమాకు పోవుచుండగా ఆమె పోలీసువలె దుస్తులుధరించి అతని వెంబడి పోయెను. అతడు ఆమెను గుర్తెరుంగలేదు. సినిమాలోనికి పోయిన పిమ్మట చేతిలో చేయికలిపెను. అతడు గుర్తించక ఎవరో ఆఫీసరు అనుకొనెను. వచ్చు చుండగా తన వెంటనే ఆమెకూడా వచ్చెను. అత డెవరితో ఒకరితో మాట్లాడుచుండగా, ఆమెకు నిగురవచ్చుచున్నదని ముందుగా ఇంటికివచ్చెను. వచ్చి దుస్తులు విడువకనే తల్లిప్రక్క నిద్రించెను. అతడువచ్చి ఆమెను గుర్తించక ఎవడో వచ్చినాడని తుపాకితో చంపబోవుచుండగా, ఆ వస్తాదు చెప్పిన మాట జ్ఞాపకము వచ్చెను.

ఇంతటిలో ఆమె అటు ఇటు మసలగా ఆమె రూపము రాజు గుర్తించెను. ఆ వస్తాదు చెప్పిన మాట జ్ఞప్తిలేనిచో నాకుమారైను చంపెడివాడ నని యెంచి, తన ధనము వృథాకాలేదని సంత సించెను.

రచన
యన్. బాలనరసింహా, 7 వ తరగతి



## చదువు

కె. జనార్దన్‌రావు, 10 వ తరగతి

గేయం

చదువుకొండోయ్, చదువుకొనుడు
జగత్తునెరిగి చదువు కొనుడు
చదువు బ్రతుకునకెంతో శ్రేష్ఠము
చదువు చదివిన జ్ఞానియగద
విశ్వవిశయము లెల్ల తెలియును
ఉన్నత విద్యలు చదువుకోవలె
బ్రతుకుకోసము
ఉన్నతికై పాటుపడుడు
మంచి మంచి పంటలనే పండించండి
ప్రతివాడుంక శ్రమికుండై
పాటుపడిన బాగుండును
నిజంగానే మనసీమకు
నిరుద్యోగ సమస్య లేదు.
చదువు బ్రతుకు నేర్పునదే
చదువుమంచి పెంచుటకే
చదువు కొనుడు చదువు కొనుడు
బ్రతుక నేర్వ చదువు కొనుడు

## ప్రబోధము

యన్. బాలనరసింహ, 7 వ తరగతి

గేయం

సాగరా ముందునకు సాగరా
విజ్ఞాన పథములో సాగరా ॥సా॥

మూడురంగుల జెండాపట్టి
ముందునకు పయనించరా
ప్రజల లోటులు తీర్పుటకునై
పైరు పంటలు పెంచరా ॥సా॥

ప్రగతి కోసము పాఠశాలకు
ప్రతి దినమ్మును పొమ్ము
పేదవారల బాధతీర్పగ
ప్రేమ మదిలో పెంచరా ॥సా॥

దేశమను రథమునకు
సారథివై నేతవు నీవురా
కన్నవారల పేరునిల్పిన
ఘనుడవై పేరొందరా ॥సా॥

## స్వజాతి గీతం

గేయం

కె. కృష్ణయ్య. ఉపాధ్యాయుడు

దేశం భారతదేశం మనది
దేశం బంగరుదేశం మనది
అఖండశౌర్యపు దేశంమనది
శాంతిదూతలది మనదేశం
శాంతిని చాటెటి భారతీయులం
వీరయోధులది మనదేశం ॥దేశం॥

కదనంకోపం చూచె చైనా
లొంగే వివరణంబులోనైన
భారతీయులలోని బాలకుండైన
బాలచంద్రులవంటి మగవాడునైన
భారత్, చైనా సోదరులం అని
చేసితివే అవినీతి
నేటికి భారత పతాకము నేర్పెనులే నీతి.
విజయమమా శాంతిప్రమిద
నిలయము మాశౌర్యానికి
నివురుగప్పిన నిప్పు
కథ తెలియగవా భాయి!



# తప్పిపోయిన గొఱ్ఱె

కె. మల్లారెడ్డి, తొమ్మిదవ తరగతి

పూర్వము ఒక ఊరిలో ఒక ధనవంతుడు ఉండెడివాడు. అతనికి ఇద్దరు కుమారులుండెడివారు. ఇతనికి చాల పొలముండెను, మరియు వ్యాపారస్తుడు. ఈ ఇద్దరి కుమారులలో ఒకడు బుద్ధిశాలి. ఇతడు తన పొలము పని చేయుచు తన తండ్రితోపాటు వ్యాపారమునకు పోవుచుండెను. ఇతని తమ్ముడు బుద్ధిహీనుడు. ఇతడు తనమాటయే మిన్న! అని తలచెడివాడు. అంతియేకాక ఇరుగు పొరుగు స్నేహితులను వెంబడించుకొని తన ఇంటి నుండి డబ్బు దొంగిలించి స్నేహితులతో దుర్వినియోగము చేసేవాడు. తండ్రి దండించినను లెక్కించేవాడుకాదు. చివరకు అతడు తన ఆస్తిని పంచుకొని ఆ పొలమునంతయు అమ్మి డబ్బంతయు తీసుకొని స్నేహితులను వెంబడించుకొని ఇల్లువదలి వెళ్ళిపోయెను. ఇచ్చట తండ్రి కుమారులు క్షేమముగా కాలక్షేపము చేయుచుండిరి. పారిపోయిన వాడు స్నేహితులతో చేరి తాను తీసుకొనిపోయిన డబ్బు అంత హాయిగా ఖర్చుపెట్టాడు. అతని స్నేహితులు కూడ "బెల్లమున్నంతసేపు ఈగలు ్రవాలినట్లు, డబ్బున్నంతసేపుండి ఎక్కడివారక్కడ మాయమైనారు. చివరకు ఇతడొక్కడే మిగిలిపోయి తాను ఒక కోమటివద్ద నౌకరుగా పనిచేయబోతాడు. ఆ కోమటి ఒకనాడు రెండు ఆవులను కొన్నాడు. ఆవులను కొన్న ఊరు ఇతని ఊరుకు సుమారు ఎనిమిది ఆమడలు. ఆ కోమటి ఇతనిని తోలించినాడు. అతడు సద్దికట్టుకొని కఱ్ఱ చేతబూని బయలుదేరినాడు.

సూర్యాస్తమయినది. ఇటువంటి పనులు ఇతడు తన ఇంటివద్దకూడ చేయలేదు. మరియు పిరికివంద. సూర్యాస్తమయమైనందున ఎనలేని భయము, దుఃఖముతో బాధపడసాగెను, మరియు అది దట్టమైన వనము. అందొక్కడే ఉన్నందువలన దుఃఖముతో తన తండ్రి జ్ఞాపకము వచ్చాడు. అప్పుడు అతనికి బుద్ధివచ్చినది. తండ్రివద్దనే ఉన్నచో నాకు ఇంతకష్టము ఎలావచ్చును? అని తలచి వెంటనే తాను ఆ వనమునుండి భయముతో తన ఇంటిదారి పట్టెను. ఇంటివద్ద తన తండ్రిగారు హాయిగా తిని మేడపై కూర్చుండెను. తన కుమారుడు తన ఇంటికి బిచ్చగాని రూపమున వచ్చుట తండ్రి దుఃఖముతో మేడదిగి కుమారునికి ఎదురుగాపోయి కుమారుడు దుఃఖముతో తండ్రిని క్షమాపణ వేడుకొన్నాడు. తండ్రి కుమారుని ఇంటికికొనిపోయి నూతన దుస్తులను ఇప్పించాడు.

అంతకి నిలువక గొప్ప విందుచేశాడు. ఆ విందునకు గల కారణము పొలములోగల పెద్దకుమారుడు సేవకులవలన తెలుసుకొని అలుక సాగించెను. తండ్రి వానిని సమాధాన పరచుటకై తప్పిపోయిన గొఱ్ఱె దొరికినచో గొల్లవాడు పొందిన ఆనందమే తను పొందియుంటిననియు, ఇక ఎన్నడు నీ పశ్చాత్తాప తప్తుడగు వాని సోదరుడు తప్పుచేయడని తెలియపరచెను.



"ఏమైనా కవిత్వం జాతిని మేల్కొల్పాలి కాని జోకొట్టకూడదు". — శ్రీ శ్రీ

"మనిషిలోని మంచితనం – ఎన్నటికీ పోనిధనం". — ఆరుద్ర

"నా తెలంగాణ కోటి రత్నాల వీణ" — దాశరథి




# సుభాసు చంద్రబోసు



జి. శకుంతల, 7 వ తరగతి.

మనదేశ ప్రజలలో అనేకమంది జాతీయ నాయకులు గలరు. వారిలో వీరనేత సుభాసు బోసు ఒకరు. 1897 జనవరి 23 వ తేదీన కటక్‌లో జన్మించెను. దీని ముఖ్యపట్టణము ఒరిస్సా. ఈతని తల్లి ప్రభావతీదేవి. తండ్రి జానకీనాథ బోసు. ఇతడు తల్లిదండ్రులకు ఆరవ సంతానము. బాల్యము నుంచి స్వాతంత్ర్యము, భారతదేశమునిన ఎంతో ప్రీతి, ప్రేమ. ఇతడు బాల్యమునుండియు ఎంతో గారాబముతో పెరిగెను.

విద్యాభ్యాసము:— ప్రొటెస్టియన్స్ యూరపియన్స్ స్కూల్ రెవెన్షా హైస్కూలు రిసిడెన్స్ కళాశాల కలకత్తాలో చదువుచుండెను. 1919 వ సంవత్సరమున B. A. ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణుడయ్యెను. మరియు ఇంగ్లాండుకు వెడలి ఉన్నత విద్య నభ్యసించెను. చదువు పూర్తి అయిన తరువాత ఉద్యోగము చేయుచుండెను. అది అతనికి గిట్టక రాజీనామ పెట్టెను. భారతదేశ నాయకుడగు (గాంధీజీతో) బాపూజీతో పరిచయమయ్యెను. ఆ కాలములో చిత్తరంజనదాసు అను నతడుండెను. బోసుబాబు ఇతని శిష్యుడు. గురు శిష్యులమధ్య మంచి సంబంధము లుండెడివి. ఆతడు ఉద్యోగమునకు రాజీనామ పెట్టి దేశ స్వాతంత్ర్యమునకై ముందంజవేసి స్వాతంత్ర్యమునకై తన శాయశక్తుల పోరాడెను. అంతేకాక అతివాదిగా ఆంగ్లేయుల క్రూరత్వము నరికట్టెను. మరియు ఆజాద్ హిందూ ఫౌజ్ అను సైన్యమును స్థాపించెను. రెండవసారి ప్రపంచయుద్ధమున పాల్గొని అనేకమంది నెదుర్కొని, బోసుబాబు కుల, మత బేధముల నెంచక అన్నిమతము లొక్కటే అని చాటి చెప్పి తానన్ని మతములను సమానముగా చూచుచుండెను. భారతదేశమున మరపురానివారిలో వీరొకరు. గొప్ప విప్లవమూర్తి. కాంగ్రెసుతో యుద్ధముచేసి వదలివేసెను. ఎక్కువగా ఎల్లప్పుడు గుఱ్ఱపుస్వారీ చేయును. ఢిల్లీ ఉద్యమము. జర్మనీ, బర్మా, ఇటలీ మొదలగు దేశములను దర్శించెను. భారతజాతిని ప్రేమించిన జాతిపురుషుడు. జపాను చూచుటకై అప్పుడే ప్రవేశము. మరియు ఆ సమయముననే భారతదేశ నిష్క్రమణము జరిగినది. తరువాత ఈ లోకమును విడిచి పరలోకమునకు పోయినట్లు ఉదంతమయినది. ఏమయినప్పటికి అతడు భారతదేశ చరిత్రలో గొప్పనేత అని చెప్పవచ్చును. నాడు శత్రుదేశముల దురాక్రమణలో దాడిసల్పిన వీరుడు. అతడు భారతదేశములో చిరస్మరణీయుడు. అతని ధైర్య సాహసములు మనకు ఆదర్శనీయమైనవి. అతని అడుగుజాడలలో మనముకూడా నడచుచు జీవించవలెను.



# ఆపద్బాంధవుడు

పూర్వము ఒక గ్రామములో ఒక కోమటివాడు గలడు. అతని పేరు రాజయ్య. అతనికొక చిన్న కొట్టు (దుకాణము) గలదు. దుకాణములోని సామానులు క్రమక్రమముగా అయిపోవుటవలన అతడు కొంత సామాను ప్రక్క పట్టణము నుండి తెచ్చుకొనుటకు ఒంటరిగా ప్రయాణమయ్యెను. అరణ్యమార్గమునుండి పోవలెను. అది మిక్కిలి భయంకర అడవి. కొంతదూరము పోవుసరికి, అకస్మాత్తుగా కొందరు దొంగలువచ్చి, ఆ కోమటిని బాగుగా చావమోది అతనివద్దనున్న డబ్బు దోచుకొని వెడలిపోయిరి. ఆ దెబ్బలకు రాజయ్య లేవలేని స్థితిలో, బాధతో, మూల్గుచూ, దారిలో పడియుండెను. అతడు ఎండలో పయనించుట వలన అతనికి దాహము ఎక్కువగు చుండెను. ఆ దారినుండి ఎవరైన వెళ్లుదురేమోనని ఆశతో వేచియుండెను. కడపటికి యువకుడొక్కడు తన గుఱ్ఱముపై పోవుచుండగా, ఆదారిలో ఎవరో మూల్గుట అతనికి వినబడినది. ఆయువకుడు గుఱ్ఱమును కొద్దిదూరములో ఆపి, దిగి మూల్గుచున్న వ్యక్తి ఎవరోయని కొంచెముసేపు ఆలోచించి, మరల ఇట్లనుకొనెను. ఎవరైతేనేమి, ఆపదలో సహాయము చేయుటయే మానవుని ముఖ్యధర్మము. అయువకుడు తన మనస్సున నిట్లనుకొనెను. 'మానవ సేవయే మాధవసేవ'. తక్షణమే అతనివద్దకేగి, అతన్నిచూచి, చాల బాధపడెను. రాజయ్య ఆ యువకుని చూచి దాహము, దాహమని చాలా ఆయాసముతో పలికెను. ఆ యువకుడు రాజయ్య దాహము తీర్చుటకై ప్రక్కలకు అటునిటు చూడగా అతనికి కొద్దిదూరమున ఒక చిన్న సరస్సు కనిపించెను. నీరు తెచ్చుటకు అతనివద్ద ఏమియు లేదు. పైగా అది అడవి. అడవిలో ఆకులు, అలములు తప్ప మరియే ఇతరవస్తువులు దొరకవు. ఆ యువకుడు ఆలోచించి, ఒక పెద్ద ఆకును త్రెంపి దానిని దొప్పవలెచేసి, ఆ కొలనువద్దకు పోయి దానినిండుగా నీరు తీసికొనివచ్చి రాజయ్య దాహము తీర్చెను. తర్వాత తగిలిన దెబ్బలు చూచి, బాధపడి, ఆ గాయములకు ప్రథమచికిత్స చేసెను. జరిగిన సంగతి అతనిద్వారా తెలిసికొనెను. ఆ యువకుడు చేయునదిలేక గుఱ్ఱముపై రాజయ్యను ఎక్కించుకొని, అతని గ్రామమునకు తీసికొనివచ్చి అతనిని రాజయ్య ఇంటివద్ద దింపెను. ఆ యువకుడు రాజయ్యకు వెళ్ళుదునని చెప్పగా, రాజయ్య ఆ యువకుని ఆపి, ఆపూట తన ఇంటిలో భోజనముచేసి పొమ్మని ప్రాధేయపడగా, యువకుడు రాజయ్య మాటను కాదనక ఆరోజు యుండునని పలికెను రాజయ్య భార్య అన్నపూర్ణమ్మ, ఆమె తనభర్తకు జరిగిన సంగతి తెలిసికొనెను. ఆమె మనస్సు అతిసున్నితమైనది ఆమె తన భర్తయందు భక్తి, అనురాగము కలిగియుండెను. ఆపూట రాజయ్య, మరియు తనకు సమయమునకు సహాయపడిన స్నేహితుడు ఇద్దరు కలసి భోజనము చేసిరి. అటుపిమ్మట ఆ యువకుడు కొంచెము సేపు విశ్రాంతి తీసుకొని తన గుఱ్ఱముపైన తను వచ్చిన పనిమీద వెళ్ళిపోయెను. అప్పటినుండి రాజయ్య తను ఒంటరిగా పోవుట మానివేసెను. కనుక మనము మన పొరుగువారికి సహాయము చేయవలెను. పొరుగువారలయినను, పరదేశస్తులయినను, చివరకు శత్రువులయినను, వారిని మనము ఆపదలోనుండి కాపాడవలెను. ప్రపంచములో మనము అందరిని ప్రేమించి, ఒకరికొకరు సహాయము చేసికొనవలెను.

:— రచన :—

ఎ. అంజయ్య, 8వ తరగతి.



# కృతజ్ఞత

అనగా అనగా ఒక రాజు ఉండెను. అతని కిద్దరు కుమారులుండిరి. వారిలో పెద్దవాని పేరు భీమయ్య చిన్నవాని పేరు రామయ్య. కొన్ని దినములకు రాజు మరణించెను. అతని పెద్దకుమారుడైన భీమయ్య రాజయ్యెను. ఇతడు ప్రజలను కన్నబిడ్డలవలె పరిపాలించుచుండెను. భీమయ్య, రామయ్య మాటిమాటికి కొట్లాడుచుండిరి. ఒకనాడు భీమయ్య. ఉపాయముగా రామయ్యను తన రాజ్యమునుండి వెడలగొట్టెను రామయ్య చిన్నతనము నుండి కుక్కలనిన చాల ఇష్టము. కాబట్టి అతడు ఒక కుక్కను పెంచుచుండెను. అతడు పోవునప్పుడు ఆకుక్కను తీసుకొని పోయెను. పోవుచుండగా మార్గమధ్యమున ఒక చిన్న తటాకము తగిలెను. ఆ తటాకములో నీరు తక్కువగా నుండుటవలన ఒక చేప ఉక్కిరి బిక్కిరి యగుచుండెను. రామయ్య దానిని చూచి దానిపై జాలి కలిగి ఆ చేపను తీసుకొనిపోయి సముద్రములో వదలిపెట్టెను. అతడు అచ్చటనుండి సమీపములో నున్న ఒక గ్రామమునకు పోయెను. ఆ గ్రామములో గోపయ్య అను ఒక గొప్ప వ్యాపారస్థుడుండెను. రామయ్య అతనితో స్నేహము చేసుకొని అతనితోపాటు వ్యాపారము చేయుచుండెను. ఒకనాడు తనవద్దనున్న కుక్కను తీసుకొనిపోయెను. గోపయ్య రామయ్య ఇరువురు కలసి ఒక రాజ్యమునకు పోయిరి. ఆ రాజువద్ద అనేక బంగారపు కడ్డీలు ఉండుటచే అతని వద్దనుండి కొన్ని బంగారపు నగలను కొనిరి. ఆ రాజు కుక్కనుచూచి "ఈ కుక్కను మాకుఇచ్చి కొన్ని బంగారపు కడ్డీలను ఇచ్చెదను తీసుకొనిపొండి" అని అనెను. రామయ్య రాజుయొక్క మాటలను విని ఈ కుక్క మీకు ఎందుకు అని అనెను. రాజు రామయ్యతో ఇట్లనెను. "మా రాజ్యమున ఎక్కువమంది దొంగలున్నారు. మా భవనమును కాచుటకు కావలె" ననెను. రామయ్య కుక్కను ఇచ్చి అతనివద్దనుండి బంగారపు కడ్డీలను తీసుకొని వచ్చుచుండెను. వారిరువురు ఒక ఓడలో నెక్కిరి. వారు సముద్రము మీదుగ వచ్చుచుండిరి. గోపయ్యకు, రామయ్యను ఎట్లయినను సముద్రములో పడవేసి అతని బంగారపు కడ్డీలను తీసుకొనవలెనని కోరిక జనించెను. ఓడ సముద్రమధ్యమునకు పోయెను. గోపయ్య రామయ్యవద్ద నున్న బంగారపు కడ్డీలను తీసుకొని ఒక గ్లాసును ఇచ్చి నీటిని ముంచుమని చెప్పెను. అతడు నీటిని ముంచుచుండగా గోపయ్య రామయ్యను సముద్రములో పడవేసెను. అతడు పడు సమయమున భగవంతుని తలచుకొనెను. అంతట అతడు పూర్వము సముద్రములో విడిచిపుచ్చిన చేప అతనిని తనవీపుపై మోసుకొని సముద్రము ఒడ్డునకు తీసుకొనివచ్చి వదలెను. అతడు మరల గోపయ్య గ్రామమునకు పోయి జరిగిన సంగతి అంతయు ఆవూరి పెద్దలకు విన్నవించెను. ఆవూరి పెద్దలు గోపయ్యను పిలిచి అడిగిరి. అతడు ఒప్పుకొనెను. ఆ ఊరి పెద్దలు అతనికి కొంత ధనమును అపరాధముగా విధించిరి. అతడు బంగారపు కడ్డీలను మరియు విధించిన సొమ్మును చెల్లించెను. ఆ డబ్బుతో రామయ్య హాయిగ జీవించుచుండెను.

-: రచన :-

కె. సత్తిరెడ్డి, 9 వ తరగతి.

## " భరతసీమ "

ఆర్. శంకరయ్య, 10వ తరగతి.

భారతదేశము మనదేనోయి
భారతీయులం మనమేనోయి
దేశరక్షణకు పాటుపడాలి
దేశముకోసం ప్రాణమివ్వాలి.

భరతసైనికులు పాటుపడాలి
భారతరైతులు కృషిచేయాలి
భరతపౌరుడు శ్రమచేయాలి
భారతదేశం వెలుగొందాలి.

న్యాయము జగతికి చేయాలి
మనుగడమంచిగ మారాలి
లంచగొండులను దునుమాలి
అందరమొకటను కోవాలి
ఐకమత్యమున మెలగాలి

ఇతరులపైన ఈర్ష్యలువద్దు
తామెక్కువయని, ఒరులు తక్కువని
తరతమభేదం తలువొద్దు
ఉన్నదానితో తృప్తిపడాలి
దేశము మనదనుకోవాలి.

విద్యార్థులందరు విద్యనార్జించాలి
కలిసి మెలిసి జాతికీర్తినే పెంచాలి
దేశాంతరములందు ఖ్యాతి నార్జించాలి
భారతీయుల మనెడిపేరు నిలుపాలి.

# శాపములాటి వాక్కు

కె. బాలాచారి, 10 వ తరగతి.

అది విశాలమైన రాజ్యము. పేరు మధుర. దానిని పరిపాలించువాడు విద్యాసేనుడు. ఇతడు మిక్కిలి బలవంతుడు. ప్రజలను కన్నబిడ్డలవలె కాపాడుచుండెను. కాని ఇతరులమాట పెడచెవిన పెట్టెడివాడు. రాజ ప్రసాదమునందు అనేకరకములైన పుష్పములచే నిండిన ఉద్యానవనము గలదు. ఆ ఉద్యానవనములో ఒక తుమ్మవృక్షము కలదు. ఆ చెట్టుపైన ఒక రామచిలుక నివసించుచుండెను. ఒకరోజు సాయంత్రమున రాజు ఉద్యానవనము తిలకించుచున్న సమయమున ఆ తుమ్మవృక్షము క్రిందికి రాగ చిలుక రెట్టవేసెను. దానితో రాజు మిక్కిలి కోపముగలవాడై ఆ చెట్టును నరికివేయుడని భటుల కాజ్ఞనిచ్చెను. రాజాజ్ఞను శిరసావహించి భటులు చెట్టును నరికివేయుచుండిరి. అట్టి సమయమున రామచిలుకకు స్థలము ఉండదని యెంచి "ఓ భటులారా ఈ వృక్షము నరకకుడు దీనిపై అనేకసంవత్సరములనుండి నివసించుచుంటిని కావున దయచేసి మీరు ఈ చెట్టను నరకుట భావ్యముకాదనెను. కాని పాపము దానిమాట ఎవ్వరు లెక్కింతురు. దానికి మిక్కలి కోపమువచ్చి ఇట్లు పలికెను. నా వృక్షము ఎట్లు నరుకుచున్నారో అట్లే మీ ఉద్యానవనములోని చెట్లు ఎక్కువ పెరిగి ఎంత నరికిన తరుగకూడదు. మరియు ఉద్యానవనములోని బావిలో నీరింకి పోవుగాక అని పలికెను. కాని ఆకాలపు పక్షులవాక్కు అలాటిదేమో దానియొక్క మాట ఒక శాపములాగ మారినది. కొంతకాలమునకు పక్షి ప్రాణము విడిచెను. అది చనిపోయిన తర్వాత ఉద్యానవనములోని వృక్షములు ఆకాశమునకు పెరిగిపోయెను. అందుచేత ఆ వృక్షములు సూర్యకిరణములను నిరోధించెను. అందువలన రాజప్రాసాదములోనికి వెలుతురు రాకపోయెను. రాజు వాటిని ఎందరితోనో నరికించుచుండెను. కాని వాటి పెరుగుదల తగ్గలేదు. చివరకు విసుగుకలిగెను. గోరుచుట్టుపై రోకలిదెబ్బ అన్నట్లు బావిలోని నీరుకూడ యింకిపోయెను. ఎంత త్రవ్వినను నీరు రాకుండెను. చివరికతడు ఒక నిర్ణయమునకు వచ్చెను. ఎవరు చెట్లను నరికి రాజ ప్రాసాదములోనికి సూర్యకిరణములను రప్పింతురో, మరియు బావిలోనికి నీరు తెప్పింతురో అట్టివారికి అర్ధరాజ్యము మరియు అందాలరాశి అయిన ఏకైక పుత్రికనిచ్చి వివాహము చేయుదును. అని ప్రకటన గావించెను. ఎందరో రాజపుత్రులువచ్చి విఫలులైరి. కొన్నాళ్ళు రాజు కష్టముతో గడిపెను.

ఆ రాజ్యమునకు ప్రక్కన ఒక అరణ్యము గలదు. ఆ అరణ్యములో ఒక ముదుసలి తన కుటుంబమును పోషించుకొనుచుండెను. అతనికి ఇరువురు కుమారులు కలరు. పెద్దవాడు సురేష్ రెండవవాడు నరేందర్, సురేష్ ఒకరి పనిని చూడక అతని పనినే చూచుకొనును. కాని నరేందర్ మిక్కలి బుద్ధిమంతుడు. పరుల కార్యమును మొదట గావించి తరువాత తన కార్యము చేయువాడు. ఒకనాడు వారు రాజసందర్శనమునకు పోదుమని తండ్రియొక్క ఆజ్ఞను తీసుకొని ప్రయాణము సాగించుచుండిరి. అది వేసవికాలము ఎండ తీవ్రముగా కాయుచుండెను. మార్గమధ్యమున దైవాంశసంభూతుడు అరణ్యమును నరికి త్రోవ చక్కగా చేయుచుండెను. అతడు అలసిపోవుటచేత నరేంద్రుడు అతని చేతియందలి గొడ్డలిని తీసికొని నరికి అతనికి సహాయపడెను. అతడు సంతసించి నరేంద్రునకు గొడ్డలిని బహూకరించెను. అది ఇచ్చుచు దాని ప్రభావము ఈ క్రిందివిధముగా తెల్పెను. ఒక వృక్షముపై దీనిని మోపిన అది ఫెళ్ళుమని విరిగి తిరిగి అది మొలకెత్తదు. నరేంద్రుడు ఆ గొడ్డలిని తీసికొని పోవుచుండెను.

ఆదారిలోనే ఒక ముదుసలి కుంటివాడు ప్రక్కనే బావి ఆ బావిలోని నీరు త్రాగుటకు ఉబలాటపడు చుండెను. కాని అతడు కుంటివాడగుటచేత దిగ లేక పోయెను. అతనికి దాహము ఎక్కువయ్యెను. ఆ సమయమున నరేంద్రుడు, సురేష్ ఇద్దరు వచ్చు చుండిరి. ఆ ముసలి వారిని జలముతెచ్చి ఇవ్వ మని కోరెను, కాని సురేష్ వినక ఊరకుండెను. నరేంద్రుడు దానికి సమ్మతించెను. అతనివద్ద నున్న మట్టిపాత్రను తీసుకపోయెను. ఆ మట్టి పాత్రకు క్రింద ఒక రంధ్రము గలదు. దాని మహిమచేత అతడు జలముతెచ్చి ఆ ముదుసలి కిచ్చెను. అతడు దాహము తీర్చుకొని సంతసించెను. ఆ పాత్ర మహిమ ఏమనగా నీరులేని బావిలోన అది పెట్టిన పాలలాంటి జలమువచ్చును. ఆ ముదు సలి నరేంద్రునికి దానిని బహూకరించెను.

నరేంద్రుడు గొడ్డలిని మరియు మట్టి పాత్రను తీసుకొని పోవుచుండెను. రాజ సందర్శనమునకు వచ్చిన సురేష్, నరేంద్రులు రాజద్వారమునగల ప్రకటన చూచిరి. దానిని సాధించుటకు నరేం ద్రుడు సమ్మతించెను. వెంటనే రాజసందర్శనము గావించుకొని ఈ పని తనవల్ల యగునని తెలిపెను. సరియేనని రాజు సమ్మతించి ఆజ్ఞగావించెను. వెంటనే నరేంద్రుడు ఆ గొడ్డలి సహాయమున సాయంకాలములోపున నరికివేసెను. తరువాత మట్టి పాత్ర సహాయమున బావిలోనికి దిగి నీరు తెప్పిం చెను. చెట్లు నరకుటచే రాజప్రసాదములోనికి యథాప్రకారముగా సూర్యరశ్మి వచ్చుచుండెను. తనకోర్కె తీర్చినవాడైన నరేంద్రునకు తనమాట ప్రకారము తన కూతురునిచ్చి వివాహము గావిం చెను. అర్ధరాజ్యముకూడ ఇచ్చెను. తన అన్నకు ఉచితమైన పదవినిచ్చి గౌరవించెను.

స ం పూ ర్ణ ము

## దే శ భ క్తి

పి. జైహింద్. ఎనిమిదవ తరగతి.

భారతీయ సోదరుడా !
అదిగో సంకుల సమరము
పొరుగువాడు పోటుపొడిచె
దేశంబును ఆక్రమించె
నీదేశపు వీరధాటి
ముందునడచి చూపించుము !

వదలకుమా నీశౌర్యము
పిలచెనదే, నినుసమరము
గాంధితాత, చూపినట్టి
పథమందే మనమునడచి
వీరభారతీయులమై
నిలుపుదమోయ్ జాతికీర్తి !






# మన కర్తవ్యము

శ్రీ పి. వై. విఠల్ రెడ్డి (ఉపాధ్యాయుడు)

మనది పవిత్రమైన భారతదేశము అంటే మన మంత భారతీయులము, మనము జాతి, మత, కుల భేదములను విడచి ఏక మాతృగర్భమునుండి వచ్చిన సోదరులవలె కలసి మెలసి యున్నప్పుడే నిజమైన భారతీయులుగ పరిగణింపబడతాము. మనము ఉన్నత భావాలను ఆదర్శాలను గల్గి అంతర్జాతీయ అభివృద్ధికి పాటుపడవలెను. స్వార్థమును విడనాడి నిస్వార్థమునకై పాటుపడవలెను. ప్రతి పౌరుడును నేను భారతీయుడను గర్వమును పొంది యుండవలెను. అందుకొరకై తన, మాన, ధనమును లెక్కచేయక అవసరమైనచో ప్రాణత్యాగమును చేయవలెను. నేడు మనదేశము ఆర్థిక పరిస్థితులలో వెనుకబడి యున్నది. అందులకు కారణములు :

1. మనము డబ్బు విలువ నెఱుగక వ్యయపఱచుట.

2. అధిక సంతానమును కల్గియుండుట. పొదుపు పద్ధతిని నేర్చుకొని డబ్బు విలువను గుర్తించుట. కుటుంబ నియంత్రణ అను మార్గముల ద్వారా వీనిని పరిష్కరింపవచ్చును. అట్లు చేసినపుడే మనదేశము సర్వతోముఖాభివృద్ధి గాంచి పూర్వపు ఔన్నత్యమును పొందగలదు. మనము కూడ అన్నివిధముల సుఖ సంతోషములను బడయగలము.

భారతీయులందఱును విద్యనేర్చి విజ్ఞానమును సంపాదించి నిరక్షరాస్యతను రూపుమాపవలెను. విద్యను ఉద్యోగముల కొరకే వినియోగించక దేశముయొక్క సర్వతోముఖాభివృద్ధికి వినియోగించి మన దేశపు ఔన్నత్యమును ఇతరదేశములకు చాటగలము. ప్రస్తుత దేశ దారిద్రమును పారద్రోలి నిత్యజీవితావసరములను పెంపొందించుకొనగలము. ప్రతి భారతీయునిలో మాతృదేశ రుధిరము ఉన్నదని గుర్తించవలెను. ఆ రక్తబిందువులను అవసరమైనపుడు భారతావనికే అర్పించవలెను. అందరను భారతీయ సైనికులుగా పాల్గొని అత్యవసర పరిస్థితులందు ఉన్నంతవరకు శత్రువులతో పోరాడి మనదేశ స్వాతంత్ర్యమును నిలబెట్టుకొనవలెను.

సత్యాహింసకై పాటుపడి నిస్వార్థముతో దేశసేవకై పూనుకొనవలెను. సత్యము, న్యాయమునకై పాటుపడి, గాంధీ, నెహ్రూ, శాస్త్రి మున్నగువారిఅడుగుజాడలలో నడచి వారి ఉపదేశములను నెరవేర్చవలెను. అప్పుడే వారి మార్గముల ననుసరించిన వారమగుదుము.

'దేశమంటే మట్టికాదోయ్, దేశమంటే మనుషులోయ్' అని గురజాడ అప్పారావుగారు చెప్పినారు. దేశమంటే మనము, మనమంటేనే దేశము. ఈ సత్యమును అందఱు గుర్తించవలెను. అప్పుడే మనదేశము మూడు పూవులు ఆరు కాయలుగా అభివృద్ధి నొందును.

దేశమునకు ఏ ఆపద సంఘటిల్లినను మనకందరకు అట్టి ఆపద వచ్చినట్లుగా గుర్తించి తక్షణమే

ఆ ఆపదను తొలగించుటకు సంసిద్ధతను కల్గియుండ వలెను.

నేడు మన ప్రభుత్వమును రెండు సమస్యలు ఎక్కువగా పీడించుచున్నవి.

కొందఱు ధనార్జనపరులు డబ్బుకొరకై తప్పు త్రోవలను త్రొక్కుచు, న్యాయమార్గములను విసర్జించి, అసత్యమునకు, అన్యాయమునకు, పాప కార్యముల కొడిగట్టి, అమాయక ప్రజానీకమును అనేక కష్టములపాలు చేయుచున్నారు. ఈ సంకుచిత బుద్ధిని విడచి నిష్పక్షపాతముగా ప్రవర్తించ వలెను.

వెనుకబడిన తరగతి అభివృద్ధికొరకై పాటుపడి వారి స్థితిగతులను వృద్ధిచేయవలెను. టెరికాటన్, ఉలన్ బట్టలను విడనాడి సామాన్య జీవనమునకు అలవడి ఆత్మగౌరవమును కాపాడుకొనవలెను.

కుటుంబనియంత్రణ:- ఎక్కువ సంతానమును మనము పొందిన వారి భోజన, ఆరోగ్య, విద్యా విషయములలో శ్రద్ధ తీసికొనక వారి భావిజీవితమును పాడుచేసిన వారమగుదుము. ఇందువలన దేశ జనసంఖ్య అధికముగ అభివృద్ధియై మిగిలిన విషయములలో వెనుకబడును. పది సంవత్సరములలో మన జనసంఖ్య పదికోట్లవఱకు పెరిగినది. కావున ఇంతమందికి ఆహారమును అదనముగా ఉత్పత్తి చేయుట చాల కష్టము. అందుచేతనే మన దేశములో ఆహారధాన్యముల ధరలు విపరీతముగా పెరిగిపోయి ప్రభుత్వము కూడ అరికట్టుటకు సాధ్యము గాకున్నవి. "తిండి కలిగితె కండ కలదోయ్, కండగలవాడేను మనిషోయ్" అని గురజాడ ఉవాచ. అందుచే వ్యవసాయమును అభివృద్ధి పరచి కూరగాయలు, పండ్లతోటలను పెంచి మనకు సరిపోవు ఆహార పదార్థములను తయారుచేసికొని దేశమును స్వయం సమృద్ధిని సాధించవలెను. అప్పుడే మన భారతావని సస్యశ్యామలముగా విరాజిల్లి నిత్యకళ్యాణము పచ్చతోరణముగా ఉండగలదు.

దేశము రథమునకు మనము చక్రములుగా ఉండి నడిపించవలెను. మనమీ దేశ అత్యవసర పరిస్థితిని గుర్తించి తక్షణమే కర్తవ్యమునకు పూనుకొని దేశ పురోభివృద్ధికి పాటుపడవలెను.



# సామెత కథ

" అత్తమీది కోపము, దుత్తమీద చూపినట్లు "

ఒక గ్రామమున ఒక చాకలివాడుండెను. వానివద్ద ఒకగాడిద ఉండెను. అతడు ఆ గాడిదపై బట్టలను చెఱువుకు తీసుకొనివెళ్ళి అచ్చట వానిని శుభ్రము చేసుకొని వచ్చుచుండెను. ఒకదినము ఆ చాకలివాడు అతని భార్యతో దినమంతయు కలహించెను. వాని మనస్సు చికాకుగా నుండెను. తరువాత ఆ చాకలి బట్టలను ఉతుకుటకు గాడిదపై బట్టలు వేసి తోలుకొని పోవుచుండ గాడిద ఓండ్ర పెట్టినది. వాడు చేతగల బడియతో దానిని మిక్కిలి బాదెను. గాడిద ఆ బాధకు తట్టుకొనలేక నేలపైబడి ప్రాణములు విడిచినది.

:- రచన :-

బి. నాగేందర్ రావు, తొమ్మిదవ తరగతి.

# కంచర్లగోపన్న - రామదాసు

వి. ప్రహ్లాద, పదవ తరగతి.

గోలకొండ రాజ్యమును పూర్వము కుతుబ్షాహిలు పాలించిరి. పూర్వకాలమున గోలకొండ అన్ని విధముల వైభవములతో తులతూగుచుండెను. దానిని పాలించిన యోధాగ్రేసరులలో తానీషా ఒకడు. ఇతడు 1668_1687 వరకు పాలించెను. ఇతనివద్ద అక్కన్న, మాదన్న అను ఇరువురు మంత్రులుండిరి. వారు మిక్కిలి తెలివిపరులై ఖ్యాతిగాంచిరి. కంచర్ల గోపన్న తానీషాకు సమకాలికుడు. అక్కన్న, మాదన్నలకు మేనల్లుడు. గోపన్న జన్మస్థానము ఖమ్మంమెట్టు వద్దనున్న నేలకొండపల్లి. ఇతని జన్మముతో ఆంధ్రదేశము పావనమైనది.

ఇతడు యుక్తవయస్కుడైన తరువాత వివాహమాడెను. పూర్వజన్మ సుకృతమువల్లనో ! రాముని పైగల అభిమానముచేతనో ! రామభక్తుడై భక్తి వినయములతో రాముని కొలిచెను. ఇతని రామభక్తిని చూచినవారు ఇతనిని "రామదాసు" అనిరి. ఇతడు వివాహమైన తరువాత రాముని దయయందు గల భక్తిని విడువక యధారీతిగా రాముని అనంత భక్తి తాత్పర్యములతో కొలుచుచుండెను. ఇతడు సామాన్య భక్తుడే కాదు గొప్పకవి. ఇతడు "దాశరథీశతకము" వ్రాసెను. ఇది అనర్గళ కవితాధారయు, వైరాగ్య సంపత్తియు కలిగి ఆంధ్ర శతకములకు మకుటమువలె నున్నదని ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనముగారనిరి. ఈ పద్యము భక్తి, వైరాగ్యములతో కూడినవి. పద్యములు ఇంపుగా రసవంతముగా యుండును. ఇతని పద్యములు కుమారుడు తన తండ్రితో కోరికను విన్నవించుకొను నటులుండును. మచ్చునకు "దీక్షవహించినకొలది" మున్నగునవి. ఇతడు వ్రాసిన ఈ శతకము శ్రీకాళహస్తీశ్వర శతకమును పోలినదని దివాకర్ల వేంకటావధానిగారి అభిప్రాయము. ఇది ఇంచుమించు ఆంధ్రదేశములో అంతటను వ్యాపించి ప్రచారము పొందినది.

ఇతని దాశరథీశతకములో శ్రీరాముని గురించి చెప్పబడినది. "ఎంతటి పుణ్యమో శబరి" "దీక్ష వహించి నాకొలది" మున్నగు పద్యములు శ్రీరాముని మహిమను గూర్చి తెలుపుచున్నవి. శ్రీరాముని పాదములకు తాకిన శిల స్త్రీగా మారిపోయెను. ఈ వింతను కవి మిక్కిలి రసవంతముగా వ్రాసెను. ఇతడు సాధారణ జీవితమును గడుపుచుండెను. భగవంతుని కరుణవల్లనో అక్కన్న, మాదన్నల దయవల్లనో తానీషాకు ఇతనిపైగల అభిమానమువల్లనో 'రామదాసు'కు తహసీలు పదవి లభించినది ఇతడు తహసీలు పదవి నిర్వహించుచున్నను గర్వించినవాడు కాడు. ఇంత గొప్ప పదవి లభించినను ఇతడు శ్రీరామచంద్రుని మరువలేదు. అతనిలోనే లీనమై ధ్యానించుచుండెడివాడు. రామదాసు వసూలుచేసిన పన్ను తానీషాకు పంపలేదు 3, 4 సం ము అయినది. కాని డబ్బు మాత్రము తానీషా కోశాగారమునకు పంపబడ లేదు. రామదాసు శ్రీ రామాలయమును నిర్మింప జేయుట ప్రారంభించెను. వసూలు అయినంత పన్ను ఆలయమునకే ఖర్చుచేసెను. విశాలమైన మండపములు, అందమైన సీతారామలక్ష్మణుల విగ్రహములతో ఆ మందిరము చూడముచ్చటగా నిర్మింపబడినది. రామదాసు చేసిన ఈ కార్యమునకు తానీషా మిక్కిలి కోపించెను. కఠినముగా శిక్ష విధించ నిశ్చయించెను. తానీషా ఆజ్ఞ ప్రకారము సేవకులు రామదాసును గోలకొండ చెఱసాల యందు బంధించిరి. చెఱసాలయందు రామదాసును నానాహింసలు పెట్టిరి. ఇతడు చెఱసాల యందు అనేక కష్టములపాలగుటచె శ్రీరామునిపై విసుగుచెంది అతనిని నిందించెనని కూడ

జనశ్రుతి. శ్రీరాముడు ప్రత్యక్షము కానందున చివరకు మందిరమునకు ఖర్చు అయిన డబ్బును తిరిగి ఇమ్మనికూడ అడిగినాడు. ఇతడు చెఱసాల యందు వ్రాసిన కీర్తనలు "ఇక్ష్వాకుల తిలక" "గరుడగమన రారా" మొదలగునవి ఇవి రసవంతమై సామాన్య జనులకు పాడుకొనునట్లుగా ఉండుటచే ఆంధ్రదేశ మంతటను ప్రచారము పొందినవి. రామదాసు బాధనుగని రామదాసునకు రాముడు ప్రత్యక్షము కాలేదు. సీత ప్రత్యక్షము కావలెనని రాముని కోరికను అతడు ఆరుమాసములకు ప్రత్యక్షమగుదునని చెప్పెను. కారణమేమనగా పూర్వజన్మమున రామదాసు చిలుకను ఆరుమాసములు బంధించెనట. కావున శిక్ష ననుభవించినాడని కథనము. చివరకు రామలక్ష్మణులు నిద్రించుచున్న తానీషాకు ప్రత్యక్షమై చెల్లించవలసిన డబ్బు చెల్లించి రామదాసును విడిపించిరి. ఇతడు ఇంత గొప్ప భక్తుడగుటచే శ్రీరాముని దూషించియు అతనికి సాక్షాత్కారమును పొందెను. ఇతడన్ని శతక పద్యములను, గీతికలను, కీర్తనలను. వ్రాయుటవలన గొప్ప కవియని పేరుగాంచెను. ఇతడు తన సంపూర్ణ జీవితమును శ్రీరాముని చరణముల కర్పించి విరాగియై సర్వ సుఖములను, భార్యను విడచినవాడు. ఇతడు క్షేత్రయ్య, త్యాగయ్యలను పోలినవాడు. ఇంతటి మహాకవిని రామభక్తుని కన్నందులకు భరతమాత గర్భము పవిత్రమయినది. ఇట్టి భక్తాగ్ర గణ్యుని జననము భరతసీమకు గర్వకారణము.



# జై జవాన్!

టి. పట్టాభిరామస్వామి, 6 వ తరగతి.

మళ్ళీ ఎందుకు వస్తావ్
ఎందుకు నిరాశపడుతావ్ !
పరాజయమూ — తిరోగమనమూ !
తప్పదు ఇది సత్యం

పాకిస్తాన్ వాడా !
కాశ్మీరం నీదంటావా ?
వద్దుసుమా ! ఒప్పందం
ఇద్దఱికి మంచిదోయ్ !

భారతీయ సోదరుడో
విన్నావా ! శత్రుఘాటి

గాండీవము చేతబట్టు
శత్రువులను తరిమికొట్టు
'జై జవాన్' అని పలుకుమురో !
సరిహద్దును రక్షింపుమురో !

# పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడు



యన్. నరసింహారెడ్డి, పదవ తరగతి

పిల్లలమఱ్ఱి పినవీరన -
కిల్లాటవాణియట్టులే కాకున్నన్
వెల్లముగా నొక రాత్రి - తెల్లగ
తెలవారువరకు తేగలదె కృతిన్.

యని ఈ కవినిగూర్చి ఒక చాటుక్తి గలదు. వాణి నారాణి యను సగర్వముగా చాటు వీలు జేసిన సుప్రసిద్ధాంధ్రకవులలో వీరన అగ్రగణ్యుడని చెప్పవచ్చును. ఇతడు విద్యానగరమును పరిపాలించిన సాళ్వగుండ నరసింహారాజు కాలమువాడు. మరియు అతని ఆస్థానకవీశ్వరుడు.

ఈ మహాకవి తండ్రి దయామాత్యుడు. ఆయన సంతానముకొఱకు వీరభద్రుని ఆరాధించెను. ఆ దేవుని కృపవల్ల అతనికి ఇరువురు కుమారు లుద్భవించిరి. వారు పెద్దవీరభద్రుడు, చిన్నవీరభద్రుడు. వారి వంశము తరతరములనుండి పండిత వంశమని ప్రసిద్ధికెక్కెను. పినవీరభద్రుడు తల్లి దండ్రుల మాటలు లెక్కపెట్టక తన యన్నవలె శ్రద్ధగా చదవక తోటి బాలురతో ఎల్లప్పుడు వాదులాడుచు తిరుగుచుండెడివాడు కాని పిన వీరన, ముఖలక్షణములనుబట్టి అతడు మిక్కిలి పండితుడగునని ప్రజలందరనుకొనెడివారు. పిన వీరభద్రునకు పదునెండేండ్లు నిండునప్పటికి చదువు కొనవలయునని అభిలాష కలిగెను. అప్పుడతనికి అక్షరాభ్యాసము చేయబడెను. ఇతడు మేధాశక్తి సంపన్నుడగుటచేత కొద్దికాలములోనే సర్వవిషయముల నభ్యసించెను. (ఇతడు విద్యాశంకరుని ప్రథమ శిష్యుడు. ఇతడు విద్యాశంకరులను గలిసి "పంచదశప్రక్రియ" అను గ్రంథమును రచించిరి.) తరువాత వేద వేదాంతాది సకల శాస్త్రములు గ్రహించి కొద్దికాలముననే గొప్ప పండిత సంపన్నుడయ్యెను. భారతి పినవీరన మేధా విశేషంబులకు మెచ్చి యోగవిద్యనుగూడ బోధించి సరస్వతీ మంత్రము నుపదేశించెను. పినవీరభద్రుడు కుటుంబ పోషణమును గూర్చి యొకప్పుడైన విచారించక తరుచుగా వేశ్యాగృహంబునకు పోవుచు రాత్రింబవళ్ళు పారమైన సుఖంబులతో కాలంబు గడుపుచుండెను. నరసింహ భూపతికి భారత కథయన్న మిక్కిలి ఇష్టము. జైమినీ భారతమును వినవలయునని అతనికెంతో అభిలాష గలదు. నొక్కనాడతడు తన యాస్థాన కవీశ్వరు లందరిని పిలిచి గౌరవించి కవిపుంగవులారా! జైమిని భారతమును ఎవరు ఎంతకాలములో ముగింపగలరో మిక్కిలి స్వల్పకాలములో ముగించు వారు ముందుకువచ్చి తాంబూలమును గైకొందురు గాక! యని ఆజ్ఞాపించెను కాని ఎవరు ముందుకు రాకుండిరి. అప్పుడు పినవీరభద్రుడు లేచి రాజా! నేనొక్క నెలలో పూర్తిచేయగలను. ఇంతకంటె తక్కువకాలములో ముగింపువారు యున్నచో ఈ తాంబూలము వారికిందు లేకున్న నేనే గైకొందును యని పలికెను. అప్పుడు కవులందరు ఏకగ్రీవముగా కొనియాడి తాంబూలమతనికే యివ్వమని రాజునకు చెప్పిరి. పినవీరభద్రుని రాజు "అయ్యా! తమరట్టు గడువులోపల ముగింపనిచో" యని అడుగగా వీరభద్రుడు నాతలగొట్టుడని తిరిగి సమాధానమిచ్చెను. వీరభద్రుడు తాంబూలమును తీసుకొనివచ్చి జరిగిన వృత్తాంతమంతయు తన యన్నయగు పెద్దవీరభద్రునికి చెప్పెను రోజులన్ని గడిచినవి జైమిని భారతములను గ్రంథము రాజున కిచ్చు దినము వచ్చినది. అదేనాటి రాత్రి వేశ్యా గృహంబునకు బోక శుచియై సరస్వతీ మంత్రంబు లను పఠించి గ్రంథ రచనకై కావలసిన పరికరము లను సమకూర్చి వదినదగ్గరికి పోయి నమస్కరించి

ఆ ఆపదను తొలగించుటకు సంసిద్ధతను కల్గియుండ వలెను.

నేడు మన ప్రభుత్వమును రెండు సమస్యలు ఎక్కువగా పీడించుచున్నవి.

కొందరు ధనార్జనపరులు డబ్బుకొరకై తప్పు త్రోవలను త్రొక్కుచు, న్యాయమార్గములను విసర్జించి, అసత్యమునకు, అన్యాయమునకు, పాప కార్యముల కొడిగట్టి, అమాయక ప్రజానీకమును అనేక కష్టములపాలు చేయుచున్నారు. ఈ సంకుచిత బుద్ధినే విడచి నిష్పక్షపాతముగా ప్రవర్తించ వలెను.

వెనుకబడిన తరగతి అభివృద్ధికొరకై పాటుపడి వారి స్థితిగతులను వృద్ధిచేయవలెను. టెరికాటన్, ఉలన్ బట్టలను విడనాడి సామాన్య జీవనమునకు అలవడి ఆత్మగౌరవమును కాపాడుకొనవలెను.

కుటుంబనియంత్రణ:— ఎక్కువ సంతానమును మనము పొందిన వారి భోజన, ఆరోగ్య, విద్యా విషయములలో శ్రద్ధ తీసికొనక వారి భావిజీవితమును పాడుచేసిన వారమగుదుము. ఇందువలన దేశ జనసంఖ్య అధికముగ అభివృద్ధియై మిగిలిన విషయములలో వెనుకబడును. పది సంవత్సరములలో మన జనసంఖ్య పదికోట్లవరకు పెరిగినది. కావున ఇంతమందికి ఆహారమును అదనముగా ఉత్పత్తి చేయుట చాల కష్టము. అందుచేతనే మన దేశములో ఆహారధాన్యముల ధరలు విపరీతముగా పెరిగిపోయి ప్రభుత్వము కూడ అరికట్టుటకు సాధ్యము గాకున్నవి. "తిండి కలిగితె కండ కలదోయ్, కండగలవాడేను మనిషోయ్" అని గురజాడ ఉవాచ అందుచే వ్యవసాయమును అభివృద్ధి పరచి కూరగాయలు, పండ్లతోటలను పెంచి మనకు సరిపోవు ఆహార పదార్థములను తయారు చేసికొని దేశమును స్వయం సమృద్ధిని సాధించ వలెను. అప్పుడే మన భారతావని సస్యశ్యామలముగా విరాజిల్లి నిత్యకళ్యాణము పచ్చతోరణముగా ఉండగలదు.

దేశము రథమునకు మనము చక్రములుగా ఉండి నడిపించవలెను. మనమీ దేశ అత్యవసర పరిస్థితిని గుర్తించి తక్షణమే కర్తవ్యమునకు పూనుకొని దేశ పురోభివృద్ధికి పాటుపడవలెను.



## సామెత కథ

" అత్తమీది కోపము, దుత్తమీద చూపినట్లు "

ఒక గ్రామమున ఒక చాకలివాడుండెను. వానివద్ద ఒకగాడిద ఉండెను. అతడు ఆ గాడిదపై బట్టలను చెరువుకు తీసుకొనివెళ్ళి అచ్చట వానిని శుభ్రము చేసుకొని వచ్చుచుండెను. ఒకదినము ఆ చాకలివాడు అతని భార్యతో దినమంతయు కలహించెను. వాని మనస్సు చికాకుగా నుండెను. తరువాత ఆ చాకలి బట్టలను ఉతుకుటకు గాడిదపై బట్టలు వేసి తోలుకొని పోవుచుండ గాడిద ఓండ్ర పెట్టినది. వాడు చేతగల బడియతో దానిని మిక్కిలి బాదెను. గాడిద ఆ బాధకు తట్టుకొనలేక నేలపైబడి ప్రాణములు విడిచినది.

:— రచన :—

బి. నాగేందర్ రావు, తొమ్మిదవ తరగతి.

# కంచర్ల గోపన్న - రామదాసు

బి. ప్రహ్లాద, పదవ తరగతి.

గోలకొండ రాజ్యమును పూర్వము కుతుబ్షాహీలు పాలించిరి. పూర్వకాలమున గోలకొండ అన్నివిధముల వైభవములతో తులతూగుచుండెను. దానిని పాలించిన యోధాగ్రేసరులలో తానీషా ఒకడు. ఇతడు 1668-1687 వఱకు పాలించెను. ఇతనివద్ద అక్కన్న, మాదన్న అను ఇరువురు మంత్రులుండిరి. వారు మిక్కిలి తెలివిపరులై ఖ్యాతిబడసిరి. కంచర్ల గోపన్న తానీషాకు సమకాలికుడు. అక్కన్న, మాదన్నలకు మేనల్లుడు. గోపన్న జన్మస్థానము ఖమ్మంమెట్టు వద్దనున్న నేలకొండపల్లి. ఇతని జన్మముతో ఆంధ్రదేశము పావనమైనది.

ఇతడు యుక్తవయస్కుడైన తరువాత వివాహమాడెను. పూర్వజన్మ సుకృతమువల్లనో ! రాముని పైగల అభిమానముచేతనో ! రామభక్తుడై భక్తి వినయములతో రాముని కొలిచెను. ఇతని రామభక్తిని చూచినవారు ఇతనిని "రామదాసు" అనిరి. ఇతడు వివాహమైన తరువాత రాముని దయయందు గల భక్తిని విడువక యథారీతిగా రాముని అనంత భక్తి తాత్పర్యముతో కొలుచుచుండెను. ఇతడు సామాన్య భక్తుడే కాదు గొప్పకవి. ఇతడు "దాశరథీశతకమును" వ్రాసెను. ఇది అనర్గళ కవితాధారయు, వైరాగ్య సంపత్తియు కలిగి ఆంధ్ర శతకములకు మకుటమువలె నున్నదని ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనముగారనిరి. ఈ పద్యము భక్తి, వైరాగ్యములతో కూడినవి. పద్యములు ఇంపుగా రసవంతముగా యుండును. ఇతని పద్యములు కుమారుడు తన తండ్రితో కోరికను విన్నవించుకొనుచు నటులుండును. మచ్చునకు "దీక్షవహించినకొలది" మున్నగునవి. ఇతడు వ్రాసిన ఈ శతకము కాళహస్తీశ్వర శతకమును పోలినదని దివాకర్ల వేంకటావధానిగారి అభిప్రాయము. ఇది ఇంచుమించు ఆంధ్రదేశములో అంతటను వ్యాపించి ప్రచారము పొందినది.

ఇతని దాశరథీశతకములో శ్రీరాముని గురించి చెప్పబడినది. "ఎంతటి పుణ్యమో శబరి" "దీక్ష వహించి నాకొలది" మున్నగు పద్యములు శ్రీరాముని మహిమను గూర్చి తెలుపుచున్నవి. శ్రీరాముని పాదములకు తాకిన శిల స్త్రీగా మారిపోయెను. ఈ వింతను కవి మిక్కిలి రసవంతముగా వ్రాసెను. ఇతడు సాధారణ జీవితమును గడుపుచుండెను. భగవంతుని కరుణవల్లనో అక్కన్న, మాదన్నల దయవల్లనో తానీషాకు ఇతనిపైగల అభిమానమువల్లనో 'రామదాసు'కు తహసీలు పదవి లభించినది ఇతడు తహసీలు పదవి నిర్వహించుచున్నను గర్వించినవాడు కాడు. ఇంత గొప్ప పదవి లభించినను ఇతడు శ్రీరామచంద్రుని మరువలేదు. అతనిలోనే లీనమై ధ్యానించుచుండెడివాడు. రామదాసు వసూలుచేసిన పన్ను తానీషాకు పంపలేదు 3, 4 సం ము అయినది. కాని డబ్బు మాత్రము తానీషా కోశాగారమునకు పంపబడ లేదు. రామదాసు శ్రీ రామాలయమును నిర్మింపజేయుట ప్రారంభించెను. వసూలు అయినంత పన్ను ఆలయమునకే ఖర్చుచేసెను. విశాలమైన మండపములు, అందమైన సీతారామలక్ష్మణుల విగ్రహములతో ఆ మందిరము చూడముచ్చటగా నిర్మింపబడినది. రామదాసు చేసిన ఈ కార్యమునకు తానీషా మిక్కిలి కోపించెను. కఠినముగా శిక్ష విధించ నిశ్చయించెను. తానీషా ఆజ్ఞ ప్రకారము సేవకులు రామదాసును గోలకొండ చెఱసాల యందు బంధించిరి. చెఱసాలయందు రామదాసును నానాహింసలు పెట్టిరి. ఇతడు చెఱసాల యందు అనేక కష్టములపాలగుటచె శ్రీరాముని పై విసుగుచెంది అతనిని నిందించెనని కూడ

జనశ్రుతి. శ్రీరాముడు ప్రత్యక్షము కానందున చివరకు మందిరమునకు ఖర్చు అయిన డబ్బును తిరిగి ఇమ్మనికూడ అడిగినాడు. ఇతడు చెఱసాల యందు వ్రాసిన కీర్తనలు "ఇక్ష్వాకుల తిలక" "గరుడగమన రారా" మొదలగునవి ఇవి రసవంతమై సామాన్య జనులకు పాడుకొనునట్లుగా ఉండుటచే ఆంధ్రదేశ మంతటను ప్రచారము పొందినవి. రామదాసు బాధనుగని రామదాసునకు రాముడు ప్రత్యక్షము కాలేదు. సీత ప్రత్యక్షము కావలెనని రాముని కోరినను అతడు ఆరుమాసములకు ప్రత్యక్షమగుదునని చెప్పెను. కారణమేమనగా పూర్వజన్మమున రామదాసు చిలుకను ఆరుమాసములు బంధించెనట. కావున శిక్ష ననుభవించినాడని కథనము. చివరకు రామలక్ష్మణులు విద్రించుచున్న తానీషాకు ప్రత్యక్షమై చెల్లించవలసిన డబ్బు చెల్లించి రామదాసును విడిపించిరి. ఇతడు ఇంత గొప్ప భక్తుడగుటచే శ్రీరాముని దూషించియు అతనికి సాక్షాత్కారమును పొందెను. ఇతడన్ని శతక పద్యములను, గీతికలను, కీర్తనలను, వ్రాయుటవలన గొప్ప కవియని పేరుగాంచెను. ఇతడు తన సంపూర్ణ జీవితమును శ్రీరాముని చరణముల కర్పించి విరాగియై సర్వసుఖములను, భార్యను విడచినవాడు. ఇతడు క్షేత్రయ్య, త్యాగయ్యలను పోలినవాడు. ఇంతటి మహాకవిని రామభక్తుని కన్నందులకు భరతమాత గర్భము పవిత్రమయినది. ఇట్టి భక్తాగ్ర గణ్యుని జననము భరతసీమకు గర్వకారణము.

## జై జవాన్!

టి. పట్టాభిరామస్వామి, 8 వ తరగతి.

మళ్ళీ ఎందుకు వస్తావ్
ఎందుకు నిరాశపడుతావ్ !
పరాజయమూ — తిరోగమనమూ !
తప్పదు ఇదిసత్యం

పాకిస్తాన్ వాడా !
కాశ్మీరం నీదంటావా ?
వద్దుసుమా ! ఒప్పందం
ఇద్దటికి మంచిదోయ్ !

భారతీయ సోదరుడో
విన్నావా ! శత్రుఘాతి

గాండీవము చేతబట్టు
శత్రువులను తరిమికొట్టు
'జై జవాన్' అని పలుకుమురో !
సరిహద్దును రక్షింపుమురో !

# పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడు

యన్. నరసింహారెడ్డి, పదవ తరగతి

పిల్లలమఱ్ఱి పినవీరన —
కల్లాలటవాణియట్టులే కాకున్నన్
తెల్లముగా నొక రాత్రిని — తెల్లగ
తెలవారువరకు చేగలడెక్కృతిన్.

యని ఈ కవినిగూర్చి ఒక చాటుక్తి గలదు. వాణి నారాణి యని సగర్వముగా చాటు వీలు జేసిన సుప్రసిద్ధాంధ్రకవులలో వీరన అగ్రగణ్యుడని చెప్పవచ్చును. ఇతడు విద్యానగరమును పరిపాలించిన సాళ్వగుండ నరసింహరాజు కాలమువాడు. మరియు అతని ఆస్థానకవీశ్వరుడు.

ఈ మహాకవి తండ్రి దయామాత్యుడు. అయన వంశానముకొలకు వీరభద్రుని ఆరాధించెను. ఆ దేవుని కృపవల్ల అతనికి ఇరువురు కుమారు లుద్భవించిరి. వారు పెద్దవీరభద్రుడు, చిన్నవీర భద్రుడు. వారి వంశము తరతరములనుండి పండిత వంశమని ప్రసిద్ధికెక్కెను. పినవీరభద్రుడు తల్లి దండ్రుల మాటలు లెక్కపెట్టక తన యన్నవలె శ్రద్ధగా చదవక తోటి బాలురతో ఎల్లప్పుడు వాదులాడుచు తిరుగుచుండెడివాడు కాని పిన వీరన, ముఖలక్షణములనుబట్టి అతడు మిక్కిలి పండితుడగునని ప్రజలందరనుకొనెడివారు. పిన వీరభద్రునకు పండ్రెండేండ్లు నిండునిప్పటికి చదువు కొనవలయునని అభిలాష కలిగెను. అప్పుడతనికి అక్షరాభ్యాసము చేయబడెను. ఇతడు మేధాశక్తి సంపన్నుడగుటచేత కొద్దికాలములోనే సర్వవిషయ ముల నభ్యసించెను. (ఇతడు విద్యాశంకరుని ప్రథమ శిష్యుడు. ఇతడు విద్యాశంకరులను గలిసి "పంచదశప్రక్రరణము" అను గ్రంథమును రచించిరి.) తరువాత వేద వేదాంతాది సకల శాస్త్రి ముల గ్రహించి కొద్దికాలముననే గొప్ప పండిత సంపన్నుడయ్యెను. భారతి పినవీరన మేధా విశేషంబులకు మెచ్చి యోగవిద్యనుగూడ బోధించి సరస్వతీ మంత్రము నుపదేశించెను. పినవీర భద్రుడు కుటుంబ పోషణమును గూర్చి యొకప్పు డైన విచారించక తరుచుగా వేశ్యాగృహంబునకు పోవుచు రాత్రింబవళ్ళు పారమైన సుఖంబులతో కాలంబు గడుపుచుండెను. నరసింహ భూపతికి భారత కథయన్న మిక్కిలి ఇష్టము. జైమినీ భారతమును వినవలయునని అతనికెంతో అభిలాష గలదు. నొక్కనాడతడు తన యాస్థాన కవీశ్వరు లందరిని పిలిచి గౌరవించి కవిపుంగవులారా! జైమిని భారతమును ఎవరు ఎంతకాలములో ముగింపగలరో మిక్కిలి స్వల్పకాలములో ముగించు వారు ముందుకువచ్చి తాంబూలమును గైకొందురు గాక! యని ఆజ్ఞాపించెను కాని ఎవరు ముందుకు రాకుండిరి. అప్పుడు పినవీరభద్రుడు లేచి రాజా! నేనొక్క నెలలో పూర్తిచేయగలను. ఇంతకంటె తక్కువకాలములో ముగింపువారు యున్నచో ఈ తాంబూలము వారికిండు లేకున్న నేనే గైకొం దును యని పలికెను. అప్పుడు కవులందరు ఏక గ్రీవముగా కొనియాడి తాంబూలమతనికే యివ్వ మని రాజునకు చెప్పిరి. పినవీరభద్రుని రాజు "అయ్యా! తమరట్టు గడువులోపల ముగింపనిచో" యని అడుగగా వీరభద్రుడు నాతలగొట్టుడని తిరిగి సమాధానమిచ్చెను. వీరభద్రుడు తాంబూలమును తీసుకొనివచ్చి జరిగిన వృత్తాంతమంతయు తన యన్నయగు పెద్దవీరభద్రునికి చెప్పెను రోజులన్ని గడిచినవి జైమిని భారతములను గ్రంథము రాజున కిచ్చు దినము వచ్చినది. అదేనాటి రాత్రి వేశ్యా గృహంబునకు పోక శుచియై సరస్వతీ మంత్రంబు లను పఠించి గ్రంథ రచనకై కావలసిన పరికరము లను సమకూర్చి వదినదగ్గరకి పోయి నమస్కరించి

"తల్లీ! నేడు నాగదిని చక్కగ నలంకరింపుము, నేను ఈ రాత్రి యింటనే విశ్రాంతును" అని చెప్పెను. ఆమె వెంటనే శయనమందిరమును సుందరముగా నలంకరించినది. రాత్రి భోజనము చేసిన తరువాత చినవీరభద్రుడు తలుపులు బిగించి శయనమందిరములో బరుండెను. అప్పుడే గుఱక పెట్టి గాఢనిద్రలో మునిగిపోయెను ఇంతలో చినవీరుని గదిలో నెవ్వరో శరవేగముగా వ్రాయుచున్నట్లు గంటముయొక్క శబ్దము పెదవీరభద్రునికి వినబడెను. పెదవీరభద్రుడు తలుపునందు నుండి చూడ సరస్వతి దివ్యవస్త్రాభరణ భూషితయై చినవీరన్న ప్రక్కన గూర్చిండి నాలుగు చేతులతో గంటము నాపకుండ వ్రాయుచుండెను. అది చూచి పెద్దవీరన్న కెవ్వున కేక వైచెను. వెంటనే ఆ స్త్రీ తన చేతిలోని గంటమును విసరగా పెద్దవీరన కంటిలో గ్రుచ్చుకొనెను. ఆమె యదృశ్యమయ్యెను. అప్పుడు వీరభద్రుడు లేచి వ్రాయుచున్నప్పుడు రాలిన తాటియాకు పొడితెచ్చి పెద్దవీరన్న కంటికద్దెను. వెంటనే కంటిబాధ అంతరించెను. ఉదయము పెద్దవీరభద్రుడు స్నానమునకు పోయి వచ్చునంతలో మిగిలిన గ్రంథము చినవీరభద్రుడు ముగించెను. అంతలో నిరసింహ భూపతి గ్రంథమును గొని రావలసినదిగా చినవీరభద్రునికి వార్తనంపెను. అప్పుడు అన్నదమ్ములిద్దఱు శుభ్ర వస్త్రములను ధరించి గ్రంథమును తీసుకొని రాజాస్థానమునకు పోయిరి. సభాభవనమున రాజుమ ఆ గ్రంథమును జదివెను. అది వినిన కవులందరు రాజా! నిన్నటివరకితడు గ్రంథము మొదలుపెట్టకుండెను అని పలుకగా రాజు! వీరభద్రుని ఈ గ్రంథ మొక్కనాటిరాత్రి ఎట్లు వ్రాయగలిగితివి యని యడుగగా. వీరభద్రుడు "వాణి నారాణియై యుండగా ఇట్టి గ్రంథ మొకలెక్కయా?" యని పలికెను కాని అదినమ్మక రాజు వీరభద్రుని శిక్షింప నిశ్చయించెను. ఆ సమయమున సింహాసనమునకు వెనుకనున్న తెరలో నెవ్వరో ఒక కాంత కంకణములు మెరయగా "రాజా! ఈ మహాత్ము డన్నమాట సత్యము. ఈతడు బ్రహ్మ యవతారము గనుక నేనాతని రాణి" నని చెప్పి యదృశ్యమయ్యెను. అప్పుడు రాజు సంతోషపడుచు ముత్తముమీద విచారించిన చినవీరన్న యమృత శక్తి గలవాడనియు నతనికి శారద వశవర్తి యనియు తెలియుచున్నదని రాజు గ్రహించెను. చినవీరన రచించిన గ్రంథములు (1) జైమిని భారతము. (2) శృంగార కుంతలము రసాత్మకమైననే కావ్యమనుమాట ఈతని గ్రంథములో కనబడును.



సూక్తులు :—

తోటమాలి కుటీరముతోడ నెపుడు
రాజభవనము పోల్చి నిరాశపడకు

—బోయి భీమన్న

అకులందున అణగి, మణగి
కవిత కోకిల పలుకవలెనోయ్
పలుకులను విని దేశమందభి
మానములు మొలకెత్తవలెనోయ్

.గురుజాడ

ఎగుడు, దిగుడులు ఇరులు వెల్గుల
లెవరికోయీ మానవులకే

—సి. నారా

ప్రపంచాన్ని చూడలేని
కవిత నిజంచూపదు
ఇసుకలో కూరుకున్న
ఉష్ట్రపక్షి కావదు

—శ్రీ శ్రీ

మాతలకు మాత సకల సంపత్సమేత
వచ్చి కాశెంతరాలు మా భరతమాత

—జి. జాషువా

పాపం పండినా బెలూన్ నిండినా
చాలాకాలం వఱకు నిలువవు

 

# గ డి యా ర ం



వై. ఇంద్రారెడ్డి, పదునొకండవ తరగతి.

[ వెంకట్రావు ఒక మ్యునిసిపల్ కార్పొరేషన్ ఆఫీసులో గుమాస్తాగా పనిచేసేవాడు. అతనికి వచ్చే చాలీ చాలని జీతములో ఎలాగో జీవితమును గడుపుతున్నాడు. అతని ఇంటికి, ఆఫీసుకు చాలా దూరము యుండుటచేత రోజు టైము సరిగా తెలియక ఆఫీసుకు ఆలస్యంగా వెళ్ళేవాడు. దానితో అధికారి అతనిపై కోపగించుకొనేవాడు. అది భరించలేక ఒక చేతి గడియారం (వాచ్‌ను)ను ఖరీదు చేయుటకై ఆఫీసులో అప్పుకొరకు దరఖాస్తు పెట్టేడు. ]

వెంకట్రావు : ఏమేవ్! ఏమిచేస్తున్నావు ? ఇటురా మరి.

భార్య : ఆఁ! వస్తున్నాను.

(కొంతసేపు తరువాత)

వెంకట్రావు : అబ్బ! ఇంకెంతసేపు ? పిలిచేది నిన్న ?

భార్య : అబ్బ! ఏమిటా వెర్రికేకలు. వస్తున్నానంటే వినిపించుకోరే.

వెంక ; ఆఁ! వచ్చేశావా! ఇలారా ఇటు కూర్చో.

భార్య : సరేకాని, ఆ విషయమేమిటో చెప్పండి.

వెంక : అందుకేగా పిలిచింది. కాని వట్టిచేతులతో వచ్చావేమిటి. కాఫీ, ఫలహారాలేమీ లేవా ?

భార్య : అయ్యవారు ఈరోజు ఇంత హుషారుగా వున్నారు ఏదో విశేషమున్నదన్నమాట

వెంక : ఉన్నదేమిటే ఉన్నది, చాలా ఉన్నది. రోజు మాదిరి వట్టిచేతులతో వచ్చావనుకున్నావా ?

భార్య : అంటే ? మీధోరణి నాకేమి అరము కావడం లేదండి. అదేదో వివరంగా చెప్పండి.

వెంక : చెప్తా! కాని...

భార్య: ఏమిటండి. ఆ కాని! ఆ కాని తొలగించేయండి.

వెంక : అది తొలగించడ అంత సులభం కాదేయ్.

భార్య : ఎందుచేతనో ?

వెంక : కాఫీ ఫలహారం తెచ్చిశావా మరి?

భార్య : అబ్బ మీరెప్పుడూ ఇంతే; ఎప్పుడు కాఫీ. కాఫీ. కాఫీ...కాని. విషయమేమిటో ?

వెంక : ఏయ్. ఏమిటా ధోరణి ? ఇంతకూ కాఫీ ఇస్తావా లేదా ?

భార్య : మీరు విషయమేదో ? చెప్పండి. ఆ తరువాత కాఫీ.

వెంక : చెప్పిన తరువాత తప్పకుండా ఇస్తావా ? లేక...

భార్య : అదేమి లేదు తప్పకుండా.

వెంక : ఐతే విను మరి.

భార్య : వింటున్నాను చెప్పండి.

వెంక : ఆఫీసులో ఐదువందల రూపాయల అప్పుకొరకు దరఖాస్తు పెట్టాను—

భార్య : నాకు తెలుసండి మీరారోజు రాళ్ళనెక్లెస్ చేయిస్తానన్నారు కదా! అందుకే అప్పు చేస్తున్నారు కాబోలు.

వెంక : అదికాదే!

భార్య : మీరూరుకోండి నాకంతా తెలుసు. కానీ విషయమే మరచిపోయాము.

వెంక : అదేమిటో ?

భార్య : అదేనండి కాఫీ ఫలహారము.

వెంక : అమ్మయ్య. బ్రతికించావు. ఇంకేదో అనుకున్నాను. ఇప్పుడు అవేవి వద్దు.

భార్య : అదేమి మాటండీ ? ఇదో ఇప్పుడే తెస్తాను.

(అంటూ లోపలికివెళ్ళి 5 నిమిషములలో కాఫీ ఫలహారంతో ప్రవేశిస్తుంది)

భార్య : (అవి టేబులుపై పెట్టి) ఏమండీ ! చూస్తున్నారేం ? తీసుకోండి.

వెంక : (మారు మాటాడకుండా తీసుకుంటాడు.)

భార్య : ఏమండీ ? ఇంతకూ ఆ నెక్లెసుకు ఎంత ఖర్చవుతుందంటారు.

వెంక : ఏ నెక్లెస్ ? నన్నేదో నట్టేట్లో ముంచేటట్లున్నావు.

భార్య ; అంటే ? మీమాటలు వింటూవుంటే ఆ అప్పుచేసింది నా నెక్లెసు కొరకు కాదా !

వెంక : కాదు.

భార్య : అయితే మరి ఎందుకండీ ?

వెంక ; అదే ! రోజూ ఆఫీసుకు ఆలస్యముగా పోతున్నానని చెప్పాను కాదా ?

భార్య ; ఔను చెప్పారు.

వెంక : ఆఁ ! ఇంకమీదట అలాటి పొరపాటు ఉండకూడదని ఒక చేతి గడియారము ఖరీదు చేయాలనుకున్నాను.

భార్య : అందుకే కాబోలు అప్పు...

వెంక : అవును మరి.

భార్య : మీకెవరిచ్చారు ఈ సలహా ?

వెంక : ఏ సలహా.

భార్య : అదే ! గడియారం కొనమని

వెంక : ఎవరి సలహా ఎందుకే ? నేను కావాలనుకున్నాను. కొంటున్నాను.

భార్య : ఆఁ ! ఇక ఉద్ధరిస్తారు లెండి.

వెంక : ఆఁ ! ఏమి.

భార్య : అవునుమరి.

వెంక : అంటే ?

భార్య : అదేనండీ ! రేపు గడియారం తీసుకున్నారనుకో మరునాడే దానికి రిపేరు. దానికి పది రూపాయల ఖర్చు అందుకనే నేను చెప్పేది సావకాశంగా వినండి. ముందు నెక్లెసు చేయించండి. తరువాత గడియారం సంగతి ఆలోచిద్దాం.

వెంక : అదేమి కుదరదు. తప్పకుండా గడియారం కొనితీరవలసిందే.

భార్య : అయితే మీరు నెక్లెసు చేయించరన్న మాట.

వెంక : ఔను.

భార్య : ఔనుమరి ఎందుకు చేయిస్తారు. నేనేమి ఆఫీసులో ఉద్యోగం చేస్తూ డబ్బు సంపాదించుతున్నానా ఏమి ? అది మీరు సంపాదిస్తున్నారు. కావున అది మీడబ్బు కనుక మీ ఇష్టమువచ్చినట్లు ఖర్చు పెట్టుకుంటారు. అయినా మధ్య నాకెందుకులెండి.

వెంక : అదికాదే ! నేను చెప్పేది విను.

భార్య : మీరు చెప్పనక్కర్లేదు నేను వినవక్కర్లేదు.

వెంక : అబ్బ ! నీకెంత బిరుసుతనం ఎలా కాస్త...

భార్య : ఐతే మరెలా ఉండమంటారు.

వెంక : అబ్బ ! ఏమీ దీనిగొడవ. నన్ను ఒక్కమాటైనా చెప్పనిచ్చావు కాదు.

భార్య : ఏమిటండీ మీరు చెప్పేది ?

వెంక : ఇలారా దారికి. ఇదో ఇటుచూడు.

భార్య : చూడకుండ కండ్లుమూసుకొన్నానా ఏమిటి ? చెప్పండి అదేమిటో వింటాను.

వెంక : నీతో ఏమాటన్నా నన్నెందుకిలా అపార్థము చేసుకుంటావు ? చాలించండి ఇక మీ ఉపన్యాసము.

వెంక : నీవేమన్నా అనుకో. కాని నేను చెప్పదలచింది చెప్పేస్తాను

భార్య : ఊఁ ! ఆపారేం చెప్పండి.

వెంక : చెప్తునుకదశే ! నన్నెందుకలా విసిగిస్తావు ముందు గడియారం తీసుకొని తరువాత నెక్లెసు గురించి ఆలోచిద్దామనుకున్నాను.

భార్య : అదేమి కుదురదు. ముందు నెక్లెసుకొని తీరాల్సిందే.

వెంక : అబ్బ ! నీమాటే నీకుకాని, నామాట పట్టించుకోవేమ్. (తలుపుదగ్గర) ఎవరండీ లోపల ? వెంకటరావు బావగారు !

వెంక : ఎవరో వచ్చినట్లున్నారు. వెళ్ళిచూడు.

భార్య : ఊఁ ! అలాగే.

(తలుపు తెరచి) సుబ్బయ్యన్నగారా ! ఏమండీ మా అన్నయ్యగారు వచ్చారు.

వెంక : ఎవరూ ? ఓ సుబ్బయ్య బావగారా ! ...

సుబ్బయ్య : ఔను బావగారు ! నమస్కారాలు.

వెంక : ఏమోయ్ ! ఎక్కడనుంచి రావటం ? అంతా క్షేమమేనా ?

సుబ్బ : ఆఁ ! అంతా క్షేమమే మీదయవల్ల నిన్ననే వచ్చా నిక్కడికి. ఆ వచ్చిన పనికాస్త అయిపోయింది. వెళ్ళేముందు మీరెలా ఉన్నారోయని చూచిపోదామని వచ్చాను. అంతా క్షేమమేగదా !

వెంక : ఆఁ ! ఏమి క్షేమమండి.

సుబ్బ : ఇంట్లో యేదైనా సుస్తీగా ఉందా ?

వెంక : అదేమి లేదు.

సుబ్బ : అయితే మరేమి ? క్షేమంగా లేనంటావు.

వెంక : అదేనయ్యా మీ చెల్లెలితో వాగలేక చస్తున్నాను.

సుబ్బ : అంటే నాకేమి అర్థముకావడంలేదు.

వెంక : నేను గనుక ఏగుతున్నాను మీ చెల్లెలితో మరొకరైతేనా !—

భార్య : ఆఁ ! ఇక చాలించండి ఈమాటలు. అన్నట్టు అన్నయ్యా మీరెపుడు భోంచేశారో ఏమో ? లేచి కాళ్ళు చేతులు కడుక్కొని కాస్త టిఫిన్ చేతువుగాని.

సుబ్బ : ఆఁ ! ఇప్పుడు టిఫిన్‌కేమి తొందరమ్మా ! బావగారేదో నీరసంగా ఉన్నట్లున్నారు. విషయమేదో తెలుసుకోనియ్యి.

భార్య : ఆఁ ! ఏముందీ. అది మామూలుగొడవే.

వెంక : అయ్యా సుబ్బయ్యగారు ! మీరు సమయానికి వచ్చారు. ఇక, మా తీర్పు బాధ్యత మీపైనే వేస్తున్నాను.

సుబ్బ : అంటే ? నాకేమీ అర్థము కావడంలేదు.

వెంక : అదేనయ్యా మేమిద్దరము వాదులాడుకున్నాము. నిన్ను తీర్పుచెప్పమని వేడుకుంటున్నాము.

సుబ్బ : ఓహో ! అదా సంగతి, సరే మీరిద్దరు ముద్దాయిలు నేను జడ్జినన్నమాట.

వెంక : ఔనయ్యా.

సుబ్బ : సరే తీర్పు చెప్పేముందు ఒక్కొక్క ముద్దాయి విషయం తెలుసుకోవలసిన అవసరం ఎంతో వుంటుంది.

భార్య : ఔను. తెలుసుకోవాలిమరి.

సుబ్బ : అయితే మరి ఒక్కొక్కరే ప్రారంభించండి.

వెంక ; ఐతే నేను ప్రారంభిస్తాను విను.

భార్య : లేదు నేనే ప్రారంభిస్తాను.

సుబ్బ : పెద్దవాడు బావ కనుక అతడే ప్రారంభించని.

భార్య : ఊఁ ! సరే.

వెంక : ఐతే వినవయ్యా. నేను ఆఫీసులో అధికారుల మాటలు పడలేక చేతి గడియారం ఖరీదు చేయుటకై ఆఫీసులో 500 రూ॥ల అప్పు తీసుకున్నాను. కాని అదేమో...

భార్య : సరే ఇక నేనుచెప్తాను వినండి. నా మెడలో ఒక నగయైన లేకుండచూసి నలుగురు ఏమనుకుంటున్నారో తెల్సా ?

సుబ్బ : మాకేమి తెలుసు ? నీవు చెప్పండే !

భార్య చెప్తూనేవున్నానుగా. మున్సిపల్ కార్పొరేషన్ ఆఫీసులో గుమాస్తాగా పనిచేసే ఆయన గారి ఆవిడకు మెడలో ఒక్క నగయైన లేదే అని అడిపోసుకుంటే అదంతా నేనెమి భరించగలను.

సుబ్బ : ఐతే అప్పు గడియారం కొరకు చేయబడినదన్నమాట. దానినికాస్త నీ నెక్లెసు కొరకు వాడుకొమ్మంటున్నావు.

భార్య : ఔనన్నయ్యా !

సుబ్బ : అన్నట్లు గడియారం అంటే నాకొకటి జ్ఞాపకము వచ్చింది చెప్తాను వింటారా మరి.

వెంక ; సరె. అదేదో చెప్పవోయ్.

సుబ్బ : ఐతే చూచారు నాగడియారం

వెంక<br>భార్య } : ఆఁ ! చూచాము.

సుబ్బ : ఐతే ఇందులో ఎన్నిముళ్లున్నాయి.

భార్య : రెండు.

సుబ్బ : ఆఁ ! నేను చెప్పదల్చుకున్న విషయమే అది.

వెంక : ఏమిటోయ్ ? నీనాటకము.

సుబ్బ : నీవు ఆగవయ్యా. మధ్యలో నన్ను ఆపకు. ఈ గడియారంను ఒక కుటుంబముగా మార్చవచ్చును.

భార్య : అదెలా సాధ్యం.

సుబ్బ : చెప్తున్నాను గా వినుమరి. కుటుంబము అన్న పుడు, అందులో భార్యా భర్తలు తప్పకుండా యుంటారుగదా. అదేవిధంగా గడియారం నే ఒక కుటుంబమనుకొని, అందులోనున్న చిన్న ముల్లు భార్యగాను, పెద్దముల్లు భర్తగాను కాపురము చేస్తున్నారనుకోండి. అప్పుడు పెద్ద ముల్లు ఎంతతిరిగినా, చిన్నముల్లులో చలనము కన్పించదు. ఆ రెంటిలో ఏ ఒక్కదాని లోప మున ఆ గడియారం పనిచేయదు. అదేవిధముగా కుటుంబములో భర్త ఆవేశముతో ఏ పనైన చేయవచ్చు. కాని భార్య వాటి నన్నింటిని శాంతముగా సరిదిద్దే సమర్థత ఉండాలి. లేక పోతే ఆ కుటుంబము రచ్చకెకుతుంది. ఆ గడి యారం మూదికే పనికిరానిదౌతుంది. నలుగుర్లో నవ్వులపాలు తప్పదు. కనుక మీరిప్పటినుంచి ఒకరి నొకరు అర్థంచేసుకొని అన్యోన్యంగా కలసి ఉండమని నేను తీర్పు చెప్పుతున్నాను. తరు వాత మీ ఇష్టం.

వెంక : మా ఆవిడకంత జ్ఞానం ఉంటేగా.

భార్య : మీకు మహా ఉన్నట్లు! అన్నయ్యా! మీరు సమయానికివచ్చి మాకండ్లు తెరిపించారు. లేక పోతె ఇది ఇంకెంతదూరము సాగేదో,

భార్య : (భర్తతో) ఏమండీ నన్ను క్షమించుతూ ఇకమీదట మీ ఇష్టప్రకారము నడచుకుంటాను. ఇప్పుడు మీ ఇష్టప్రకారము వాపీ ఖరీదు చేయండి.

వెంక : ఏమే ఇంతకు నువ్వు మవ్వేనా?

భార్య : నేను కాక మరి ఎవరనుకున్నారండి!

సుబ్బ : ఇప్పటికే చాల ఆలస్యమైంది. ఇక వాకు సెలవిస్తారా.

వెంక : అదేమిటి బావగారు అలామాట్లాడుతారేం. ఈపూటకు ఇక్కడే యుండి, ప్రొద్దున్నే వెళ్లదు గాని

సుబ్బ : అఁ! ఊర్లో చాలా పనులున్నాయి తొంద రగా వెళ్ళాలి.

భార్య : అదేమి కుదురదు. అంత తొందర పను లుంటే పోయిన తరువాత చేసుకోవచ్చుగా.

సుబ్బ : సరే. మీ ఇష్టాన్ని ఎప్పుడు కాదన్నాను.

వెంక : ఇంకా అక్కడేం చేస్తున్నావు? పోయి నీవంటపనేదో నీవు చూసుకో పో. ఇదో మేము స్నానము ముగించుకొని వచ్చేస్తాము. తొందరగా కానీయ్ వంట.

(భార్య లోపలికి వెళ్తుంది)

వెంక : లెండి, బావగారూ : ఇక స్నానానికి వెళ్దాము.

(ఇద్దరు లోపలికి వెళ్తారు.)

[ తెరవ్రాలును ]



ప్రేమ నిచ్చిన, ప్రేమ వచ్చును ప్రేమ నిలిపిన, ప్రేమ నిలుచును
మాయమర్మము లేనినేస్తము మగువలకు మగవారికొక్కటె.

— గురుజాడ.



వెంక : ఎవరూ ? ఓ సుబ్బయ్య బావగారా ! ...

సుబ్బయ్య : ఔను బావగారు ! నమస్కారాలు.

వెంక : ఏమోయ్ ! ఎక్కడనుంచి రావటం ? అంతా క్షేమమేనా ?

సుబ్బ : ఆఁ ! అంతా క్షేమమే మీదయవల్ల నిన్ననే వచ్చా నిక్కడికి. ఆ వచ్చిన పనికాస్త అయిపోయింది. వెళ్ళేముందు మీరెలా ఉన్నారో యని చూచిపోదామని వచ్చాను. అంతా క్షేమమేగదా !

వెంక : ఆఁ ! ఏమి క్షేమముంది.

సుబ్బ : ఒంట్లో యేమైనా సుస్తిగా ఉందా ?

వెంక : అదేమి లేదు.

సుబ్బ : అయితే మరేమి ? క్షేమంగా లేనంటావు.

వెంక : అదేనయ్యా మీ చెల్లెలితో వాగలేక చస్తున్నాను.

సుబ్బ : అంటే నాకేమి అర్థముకావడంలేదు.

వెంక : నేను గనుక ఏగుతున్నాను మీ చెల్లెలితో మరొకరైతేనా !—

భార్య : ఆఁ ! ఇక చాలించండి ఈమాటలు. అన్నట్టు అన్నయ్యా మీరెపుడు బయలుదేరారో ఏమో ? లేచి కాళ్ళు చేతులు కడుక్కొని కాస్త టిఫిన్ చేతువుగాని.

సుబ్బ : ఆఁ ! ఇప్పుడు టిఫిన్ కేమి తొందరమ్మా ! బావగారేదో నీరసంగా ఉన్నట్లున్నారు. విషయమేదో తెలసుకోనియ్యి.

భార్య : ఆఁ ! ఏముందీ. అది మామూలుగొడవే.

వెంక : అయ్యో సుబ్బయ్యగారు ! మీరు సమయానికి వచ్చారు. ఇక, మాతీర్పు బాధ్యత మీపైనే వేస్తున్నాను.

సుబ్బ : అంటే ? నాకేమీ అర్థము కావడంలేదు.

వెంక : అదేనయ్యా మేమిద్దరము వాదులాడుకున్నాము. నిన్ను తీర్పుచెప్పమని వేడుకుంటున్నాము.

సుబ్బ : ఓహో ! అదాసంగతి, సరే మీరిద్దరు ముద్దాయిలు నేను జడ్జినన్నమాట.

వెంక : ఔనయ్యా.

సుబ్బ : సరే తీర్పు చెప్పేముందు ఒక్కొక్క ముద్దాయి విషయం తెలుసుకొనవలసిన అవసరం ఎంతో వుంటుంది.

భార్య : ఔను. తెలుసుకోవాలిమరి.

సుబ్బ : అయితే మరి ఒక్కొక్కరే ప్రారంభించండి.

వెంక ; ఐతె నేను ప్రారంభిస్తాను విను.

భార్య : లేదు నేనే ప్రారంభిస్తాను.

సుబ్బ : పెద్దవాడు బావ కనుక అతడే ప్రారంభించని.

భార్య : ఊఁ ! సరే.

వెంక : ఐతే వినవయ్యా. నేను ఆఫీసులో అధికారుల మాటలు పడలేక చేతి గడియారం ఖరీదు చేయుటకై ఆఫీసులో 500 రూ॥ల అప్పు తీసుకున్నాను. కాని అదేమో...

భార్య : సరే ఇక నేనుచెప్తాను వినండి. నా మెడలో ఒక నగయైన లేకుండచూసి నలుగురు ఏమనుకుంటున్నారో తెల్సా ?

సుబ్బ : మాకేమి తెలుసు ? నీవు చెప్పండే !

భార్య చెప్తు నేవున్నానుగా. మున్సిపల్ కార్పొరేషన్ ఆఫీసులో గుమాస్తాగా పనిచేసే ఆయనగారి ఆవిడకు మెడలో ఒక్క నగయైన లేదే అని ఆడిపోసుకుంటే అదంతా నేనేమ్మి భరించగలను.

సుబ్బ : ఐతే అప్పు గడియారం కొరకు చేయబడినదన్నమాట. దానినికాస్త నీ నెక్లెసు కొరకు వాడుకొమ్మంటున్నావు.

భార్య : ఔనన్నయ్యా !

సుబ్బ : అన్నట్లు గడియారం అంటే నాకొకటి జ్ఞాపకము వచ్చింది చెప్తాను వింటారా మరి.

వెంక ; సరె. అదేదో చెప్పవోయ్.

సుబ్బ : ఐతే చూచారు నాగడియారం

వెంక
భార్య } : ఆఁ ! చూచాము.

సుబ్బ : ఐతే ఇందులో ఎన్నిముళ్లున్నాయి.

భార్య : రెండు.

సుబ్బ : ఆఁ ! నేను చెప్పదల్చుకున్న విషయమే అది.

వెంక : ఏమిటోయ్ ? నీనాటకము.

సుబ్బ : నీవు ఆగవయ్యా. మధ్యలో నన్ను ఆపకు. ఈ గడియారంను ఒక కుటుంబముగా మార్చవచ్చును.

భార్య : అదెలా సాధ్యం.

సుబ్బ : చెప్తున్నామగా వినుమరి. కుటుంబము అన్నపుడు, అందులో భార్యాభర్తలు తప్పకుండా యుంటారుగదా. అదేవిధంగా గడియారంనే ఒక కుటుంబమనుకొని, అందులోనున్న చిన్నముల్లు భార్యగాను, పెద్దముల్లు భర్తగామ కాపురము చేస్తున్నారనుకోండి. అప్పుడు పెద్దముల్లు ఎంతతిరిగినా, చిన్నముల్లులో చలనము కన్పించను. ఆ రెంటిలో ఏ ఒక్కదాని లోపమున ఆ గడియారం పనిచేయదు. అదేవిధముగా కుటుంబములో భర్త ఆవేశముతో ఏ పనైన చేయవచ్చు. కాని భార్య వాటి నన్నింటిని శాంతముగా సరిదిద్దే సమర్థత ఉండాలి. లేకపోతే ఆ కుటుంబము రచ్చకెకుతుంది. ఆ గడియారం మాదిరే పనికిరానిదౌతుంది. నలుగుర్లో నవ్వులపాలు తప్పదు. కనుక మీరిప్పటినుంచి ఒకరి నొకరు అర్థంచేసుకొని అన్యోన్యంగా కలిసి ఉండమని నేను తీర్పు చెప్పుతున్నాను. తరువాత మీ ఇష్టం.

వెంక : మా ఆవిడకంత జ్ఞానం ఉంటేగా.

భార్య : మీకు మహా ఉన్నట్లు! అన్నయ్యా! మీరు సమయానికివచ్చి మాకండ్లు తెరిపించారు. లేకపోతె ఇది ఇంకెంతదూరము సాగేదో,

భార్య : (భర్తతో) ఏమండీ నన్ను క్షమించుతూ ఇకమీదట మీ ఇష్టప్రకారము నడచుకుంటాను. ఇప్పుడు మీ ఇష్టప్రకారము వాటి ఖరీదు చేయండి.

వెంక : ఏమే ఇంతకు నువ్వు మవ్వేనా?

భార్య : నేను కాక మరి ఎవరనుకున్నారండి!

సుబ్బ : ఇప్పటికే చాల ఆలస్యమైంది. ఇక వాకు సెలవిస్తారా.

వెంక : అదేమిటి బావగారు అలామాట్లాడుతారేం. ఈపూటకు ఇక్కడేయుండి, ప్రొద్దున్నే వెళ్లుదురుగాని

సుబ్బ : ఆఁ! ఊర్లో చాలా పనులున్నాయి తొందరగా వెళ్ళాలి.

భార్య : అదేమి కుదురదు. అంత తొందర పనులుంటే పోయిన తరువాత చేసుకోవచ్చుగా.

సుబ్బ : సరే. మీ ఇష్టాన్ని ఎప్పుడు కాదన్నాను.

వెంక : ఇంకా అక్కడేం చేస్తున్నావు? పోయి నీవంటపనేదో నీవు చూసుకో పో. ఇదో మేము స్నానము ముగించుకొని వచ్చేస్తాము. తొందరగా కానీయ్ వంట.

(భార్య లోపలికి వెళ్తుంది)

వెంక : లెండి, బావగారూ : ఇక స్నానానికి వెళ్దాము.

(ఇద్దరు లోపలికి వెళ్తారు.)

[ తెరప్రాలును ]



ప్రేమ నిచ్చిన, ప్రేమ వచ్చును ప్రేమ నిలిపిన, ప్రేమ నిలుచును
మాయమర్మము లేనినేస్తము మగువలకు మగవారికొక్కటె.

— గురుజాడ.



# స్వాతంత్ర్య - దినము

బి. సుగుణాబాయి, 7 వ తరగతి.

భారతీయులు జరుపుకొను ఉత్సవములలో స్వాతంత్ర్యదినము ముఖ్యమైనది. రెండు శతాబ్దముల క్రిందట ఆంగ్లేయుల పాలనలో నున్నామని అందరికి తెలిసిన విషయమే. మనము వారి పాలనలో అనేక క్లిష్ట పరిస్థితుల నెదుర్కొన్నాము. ఇట్టి దాస్యమును తొలగించి స్వాతంత్ర్యము తెచ్చుటకై ఎందరో జాతీయ నేతలు ఉడుకురక్తము ఉప్పొంగగ స్వాతంత్ర్యమునకై ప్రాణము లర్పించినారు. ముఖ్యముగా గాంధీ, నెహ్రూ, పటేల్ మున్నగువారు భారతీయులలో ఉద్రేకము కలిగించి, ఎన్నియో పర్యాయములు పట్టుబడుచు విప్లవములను లేపిరి. "కష్టే ఫలి" యన్నట్లు మన భారతీయులు పడిన పాట్లకు ఫలితముగా పదిహేను ఆగష్టు 1947 లో స్వాతంత్ర్యమును పొందితిమి.

ఇట్టి స్వాతంత్ర్య దినమును పవిత్రముగా మహానందముతో చేసుకొనవలసిన బాధ్యత మన భారతీయులది. ఈ బాధ్యత సామాన్య మానవుడు మొదలు రాష్ట్రపతి వరకు నిర్వహించవలసియుండును. మనము ఐకమత్యముగా నున్నప్పుడు ఎట్టి క్లిష్ట సమస్యలనైనను పరిష్కరింపగలము. మాతృదేశ రక్షణకై స్త్రీ, పురుషులు సమయము వచ్చినప్పుడు కత్తిబట్టి కదనరంగములో దూకవలయును. జాతీయ నేతలు కూడ దేశ ప్రజలకు తగిన ప్రోత్సాహము నివ్వవలయును. ఇతర దేశములు దాడిచేయు సమయమున అవకాశమును చూచి, దోపిడి ప్రారంభించు ద్రోహులను రూపుమాప వలయును. కావున ప్రతి భారతీయుడు దేశరక్షణకై పాటుపడవలెను.

అప్పుడే స్వాతంత్ర్యముయొక్క సార్థక్యము పొందినవార మగుదుము.



మల్లెల్లా బ్రతుకకున్నా — ముల్లులా జీవింపవచ్చు.

—సి. నారాయణరెడ్డి.



Members of the Students Union with their Advisers 1967-68.



Students self - Government day with Secretary Z. P. Hyderabad
SRI JOSEPH, SRI B. ANANDA RAO, Headmaster.

The successful candidates in 10th All India United Nation's Information Test. with their Chief Instructors.



## XI Class Students with their Subject Teachers.



*Sitting L. to R.* : (2) Tirunagari (Telugu Pandit), (3) M. Papa Reddy, B. A., B. Ed. (4) B. Ananda Rao, B. Sc., B. Ed. (H. M.) (5) P. Venkat Reddy, B. A., LL. B. (6) C. Narayana Reddy (Hindi Pandit.)

# जन्म भूमि

भारत हमारी जन्म भूमि है।
वीर माता का देश हमारा।
उत्तर में हैं, हिमालय पर्वत।
दक्षिण में हैं, महा समुद्र।
शत्रुओं को वश करता लिडर॥

भरा हुआ है वीर जवानों से।
उत्तर में बहती है गंगा।
शस्य शामल है देश हमारा।
झण्डा ऊँचा रहे हमारा।
रामचन्द्र की धर्म भूमी है॥

हरिश्चन्द्र की सत्य भूमी है।
राणा प्रताप की वीर भूमी है।
गांधी, पण्डित, लाल बहादुर नेताओं की
अमर भूमी यह है प्यारा देश हमारा
सत्य अहिंसा धर्म हमारा॥

देश हमारा सब से प्यारा।
स्वतन्त्र देश हमारा भारत।
वीर जवानों भारत माता की शान बढ़ाओ
भारत हमारी जन्म भूमी है।
धर्म भूमी है पुण्य भूमी है॥

आर. एस. आंजनेयुलु,
कक्षा–११ वीं

